

జాన్ మిరో 1893-1983

## ముఖచిత్రం

ఇరవయ్యో శతాబ్దిని అత్యంతంగా ప్రభావితం చేసిన వారిలో పికాసోతో పాటు మిరోగూడ ఉన్నాడు. ఇతడు వృత్తిపని చేసుకొనే వారి కుటుంబంలో జన్మించాడు. ఇతడు చిత్రకారుడు కావాలనుకొంటే, తండ్రి అడ్డుపెడి, బార్సిలోనాలో పుస్తకాల షాపులో పనిచేయమన్నాడు. దీనితో మిరోకు పిచ్చెక్కినట్లైంది. ఇది అతని పట్టుదలను మరింతపెంచింది. 1919లో ఇతడు పారిస్ నగరంచేరి అధివాస్తవిక వాద వైతాళికులలో చేరిపోయాడు మిరోతన కాలాన్ని ఫ్రాన్స్, స్పెయిన్, అమెరికాలలో గడిపాడు అమెరికాలో ఇతడు హోటళ్ళకు కుడ్య చిత్రాలను వేశాడు అతడి సహజహాస్యం, వాస్తవ కథాచిత్రణం మీద అతనికున్న ఆసక్తి అతని కృతులను బాగా ప్రాచుర్యంలోకి తెచ్చాయి పికాసో లాగే ఇతడూ వృద్ధాప్యం వచ్చేవరకు,చిత్రాలు చేస్తూనే ఉన్నాడు.

మిరో 1920లో అత్యంత ప్రభావిక శక్తి ఉన్న ఆంద్రీబ్రెటన్(Andre Breton) చుట్టూచేరిన అధి వాస్తవిక కవులు, చిత్రకారులతో చేరిన తరువాత బ్రెటన్ ఇతని గురించి ఇలా అంటాడు· ''1924లో మిరో గందరగోళ ప్రవేశం అధివాస్తవిక కళా వికాసంలో ఒక ముఖ్యఘట్టం''. అధివాస్తవిక కళాకారులు మాదక ద్రవ్యాలతో చిత్తభ్రమలు కల్పించుకొని, తమ మనస్సులను చేతన నియంత్రణ నుంచి విముక్తం కావించుకొనే సమావేశాల్లో పాల్గొన్నాడు 1930ల్లో కమ్యూనిస్టు పార్టీలో చేరాక ఏళ్ళకు దూరమయ్యాడు.

## ముఖచిత్రం గురించి

నాజీ సిద్ధాంతం

హిట్లర్ రాసిన, ''1925-26ల్లో రెండు సంపుటాలుగా ప్రకటితమైన'' మెయిన్ కాంఫ్‌ను (Mein Kampf = My Struggle = నా పోరాటం) సమకాలీన ప్రపంచం పట్టించుకోక పోవడాన్ని ఈ చిత్రం వ్యంగ్యంగా ఎత్తిచూపుతుంది అతడు తొమ్మిదు నెలలు కారాగారంలో ఉన్నప్పుడు రాసిన ఈ గ్రంథం రాజకీయ ఆత్మకథ. నిజానికి అది అతడు పక్షపాత ధోరణితో సమకాలీన రాజకీయ రంగాన్ని అంచనా వేట్టడం. అతడి ఆర్యసిద్ధాంతం ( తమ జర్మన్ జాతేగొప్పదని, కల్తీలేనిదని), యూదులు, కమ్యూనిస్టులు అంటే అతనికి ఉన్న ఉక్రోషం, అతని యుద్ధోన్మాదం, ప్రా. దిశగా జర్మన్ విస్తరణ వాంఛ - ఇవన్నీ బలీయంగా తీవ్రసంవేదనలతో ప్రతి పుటలోను అభివ్యక్తీకరించబడ్డాయి ఇది ప్రపంచానికి హెచ్చరికగా పనిచేసింది

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 10 సెప్టెంబరు 1998 సంచిక 9

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-

ముఖచిత్రం : ***నాజీ సిద్ధాంతం***

**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# LIST OF THE 100 BEST NOVELS

1. Ulysses, *James Joyce*
2. The Great Gatsby, *F. Scott Fitzgerald*
3. A Portrait of the Artist as A young Man, *James Joyce*
4. Lolita, *Vladimir Nabokov*
5. Brave New World, *Aldous Huxley*
6. The Sound and the Fury, *William Faulkner*
7. Catch-22, *Joseph Heller*
8. Darkness at Noon, *Arthur Koestler*
9. Sons And Lovers, *D.H. Lawrence*
10. The Grapes of Wrath, *John Steinbeck*
11. Under The Volcano, *Malcolm Lowry*
12. The Way of All Flesh, *Samuel Butler*
13. 1984, *George Orwell*
14. I, Claudius, *Robert Graves*
15. To the Lighthouse, *Virginia Woolf*
16. An American Tragedy, *Theodore Dreiser*
17. The Heart is a Lonely Hunter, *Cars Mccullers*
18. Slaughterhouse Five, *Kurt Vonnegut*
19. Invisible Man, *Ralph Ellison*
20. Native Son, *Richard Wright*
21. Henderson the Rain King, *Saul Bellow*
22. Appointment in Samarra, *John O'Hara*
23. U S A. (Trilogy), *John Dos Passos*
24. Winesburg, Ohio, *Sherwood Anderson*
25. A Passage to India, *E.M. Forster*
26. The Wings of the Dove, *Henry James*
27. The Ambassadors, *Henry James*
28. Tender is the Night, *F. Scott Fitzgerald*
29. The Studs Lonigan Trilogy, *James T. Farrell*
30. The Good Soldier, *Ford Maddox Ford*
31. Animal Farm, *George Orwell*
32. The Golden Bowl, *Henry James*
33. Sister Carrie, *Theodore Dreiser*
34. A Handful of Dust, *Evelyn Waugh*
35. As I Lay Dying, *William Faulkner*
36. All the King's Men, *Robert Penn Warren*
37. The Bridge of San Luis Rey, *Thornton Wilder*
38. Howards End, *E.M. Forster*
39. Go Tell it on the Mountain, *James Baldwin*
40. The Heart of the Matter, *Graham Greene*
41. Lord of the Flies, *William Golding*
42. Deliverance, *James Dickey*
43. A Dance to the Music of Time (Series), *Anthony Powell*
44. Point Counter Point, *Aldous Huxley*
45. The Sun Also Rises, *Ernest Hemingeay*
46. The Secret Agent, *Joseph Conrad*
47. Nostromo, *Joseph Conrad*
48. The Rainbow, *D.H. Lawrence*
49. Women in Love, *D H. Lawrence*
50. Tropic of Cancer, *Henry Miller*
51. The Naked and the Dead, *Norman Mailer*
52. Portnoy's Complaint, *Philip Roth*
53. Pale Fire, *Vladimir Nabokov*
54. Light in August, *William Faulkner*
55. On the Road, *Jack kerouac*
56. The Maltese Falcon, *Dashiell Hammett*
57. Parade's End, *Ford Maddox Ford*
58. The Age of Innocence, *Edith Whartion*
59. Zuleika Dobson, *Max Beerbohm*
60. The Moviegoer, *Walker Percy*
61. Death Comes for the Archbishop, *Willa Cather*
62. From Here to Eternity, *James Jones*
63. The Wapshot Chronicles, *John Cheever*

*(Countinue on page 613)*

# ఈ శతాబ్ది మేటి నవల-యూలిసీజ్

– మిసిమి వర్క్ షాప్

ఇరవయ్యో శతాబ్ది అంతమై ఇరవై ఒకటో శతాబ్ది ప్రభవించడానికి సంవత్సరం నాలుగు మాసాలకు మించి వ్యవధి లేదు. ఈ పదహారు నెలల్లో ప్రపంచం దృష్టినాకర్షించే బ్రహ్మాండమైన మరో మహానవల వస్తుందని మనం అనుకోలేం. ఇటువంటి సందర్భంలో రాండమ్ హౌస్ అనుబంధశాఖ అయిన మోడరన్ లైబ్రరీ సాహితీ వేత్తలతో ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీలో మయాంజెలాన్ (Maya Angelon), డేనియల్ జె. బూర్స్టిన్ (Danial J. Boorstin), ఎ.యస్. బ్యాట్ (A.S.Byatt) క్రిస్టోఫెర్ సెర్ఫ్ (Cristopher Cerf), షెల్బీఫూటి (Shelby Foote) వర్టన్ గ్రిగోరియన్ (Vartan Gregorian), ఎడ్మండ్ మోరిస్ (Edmund Morris) జాన్ రిచర్డ్సన్ (John Richardson) ఆర్థర్ ష్లెసింగర్ (Arthur Schlesinger) జూనియర్ విలియమ్ స్టిరాన్ (William Styron) గోరె విడాల్ (Gore Vidal) ఉన్నారు. వీరి కప్పగించిన పని ఈ శతాబ్దిలో ఇంతవరకు వచ్చిన వంద అతి మంచి నవలలను ఎంపిక చేయడం. వీరు అనేక మంది నిష్ణాతుల సలహాలు స్వీకరించారు. వీరు ఎంపికచేసిన 100 నవలల్లో జేమ్స్ జాయిస్ రచించిన ''యూలిసీజ్'' ప్రథమ స్థానాన్ని ఆక్రమించింది. దీనితోపాటు మరో నాలుగు నవలలు గూడ ప్రథమ స్థానం కోసం పోటీ పడ్డాయి. ఈ ఐదింటిలో దేనికి ప్రథమస్థానం ఇవ్వాలో అర్థంకాలేదు. మళ్ళీ మళ్ళీ పునర్విమర్శించుకొని చివరకు యూలిసీజ్‌కే ప్రథమస్థానం ఇచ్చారు.

మోడరన్ లైబ్రరీ సంపాదకవర్గ అధ్యక్షుడు సెర్ఫ్ (Cerf). ఇతడు మోడరన్ లైబ్రరీని, రాండమ్ హౌస్ (Random House)ను కొన్న బెనెట్ సెర్ఫ్ (Bennet Cerf) కొడుకు. అతడన్నాడు: ''కాలం మీద నిలిచిన, గొప్పగుణం ఉన్న నవలలనే ఏరడానికి ప్రయత్నంచేశాము''.

సోమవారం, జూలై 20వ తేదీ ఆయన చెప్పాడు: ''మేము కమిటీ మెంబర్లను వారి గుణగణాలను నిపుణతను, విశేషజ్ఞానాన్ని చూసి ఎంపికచేశాము. అంతేకాదు, వారి స్నేహపూర్వక సహకారాన్ని చూసి ఎంపికచేశాము. వారిలో ఎవరికి వారిని విడివిడిగా తమకు నచ్చిన 100 నవలల జాబితాను తయారు చేసి పంపమని కోరాము. అటువంటి జాబితాలనుంచి తుది జాబితాను తయారుచేశాము. ఎవరు పబ్లిష్ చేశారనే విషయం పరిగణనలోకి తీసుకోలేదు. దొసెరిస్ లాసింగ్ (Doserise Lassing) టోని మారిసన్ (Toni Morison) లను గూడ చేర్చి ఉంటే బాగుండేదనిపించింది. మొత్తం జాబితాలో ఎనిమిది మంది ఆడవాళ్ళు మాత్రమే ఉన్నారు. న్యాయ నిర్ణేతలలో ఒకే ఒక స్త్రీ, ఆంగ్ల నవలా రచయిత్రి, బ్యాట్ (Byatt) మాత్రమే ఉన్నారు.

దీనికి కచ్చితమైన కొలబద్ధ ఏమీ లేకపోయినా ఫలితాలు మేము ఊహించినట్లుగానే ఉన్నాయి. దీని వెనుక ఉన్న మా ఉద్దేశం ఏమంటే, పాఠకులు ప్రేమించబోయే పుస్తకాలను వారు చదివేట్లు చేయడమే.

మోడరన్ లైబ్రరీ బోర్డుని పెంచుతాం. వచ్చే సంవత్సరం కాల్పనికేతర (non-fiction) గ్రంథాల జాబితాను 1900ల నుంచి విడుదల చేస్తాం.''

జాయిస్ తన రచనలన్నింటిలోను, గ్రీకు పురాణ నాయకుడు యూలిసీజ్ ప్రదర్శించిన సాహసాన్నే ప్రదర్శించాడు. "A portrait of the Artist as a young Man' అనే నవలలో అతడు వైయక్తికంగా తానేమిటో నిర్వచించాడు: ''నాకు నమ్మకం లేని దేనికి - అది నా స్వగృహం కానివ్వండి, పితృ భూమి

కానివ్వండి (మనకు మాతృభూమి) మతం కానివ్వండి - నేను విధేయుడనై ఉండను. నన్ను రక్షించుకోవడానికి నాకున్న ఆయుధాలను - మౌనం, ప్రవాసం, వైదగ్ధ్యం - మాత్రమే ఉపయోగించుకొంటూ, నాకు వీలైన ఎదో ఒక జీవన విధానం ద్వారా లేదా కళ ద్వారా నన్ను నేను అభి వ్యక్తం గావించుకొంటాను''. అతడు తన ఇరవైయ్యో ఏటనుంచి అనేక ఐరోపా నగరాలలో ప్రవాసంలో, భాషలను బోధించేగురువుగా, అత్యంత పేదరికంతో గడిపాడు. అతడు ఏడు సంవత్సరాల ఏకాగ్రతతో యూలిసీజ్ నవలను రాశాడు. 1914 మార్చిలో ఈ నవల మొదలుపెట్టాడు. ఈ నవలను ఈ కమిటి గుర్తించకముందే, చాలకాలం క్రిందటే, దీనిని ప్రపంచం ఇరవయ్యో శతాబ్ది గొప్పనవలగా గుర్తించింది. ఇది మొదట పారిస్‌లో అచ్చు అయింది. 1930 వరకు అమెరికాలో దీనిని నిషేధించారు. కారణం అశ్లీలమని. అమెరికాలో దీని మీద కోర్టులో విచారణ జరిగింది. న్యాయాధి పతి వుల్సె లైంగికతకు, అశ్లీలతకు మధ్య తేడాను సుదీర్ఘంగా చర్చించి, ఇది గొప్ప మనః కల్పిత కృతి అని, దీని ప్రభావం వాంతికార (emetic) మే కాని కామోద్దీపం (erotic) కాదని తీర్పు చెప్పాడు. అసలు యూలిసీజ్‌ను ఈ తీర్పు కోసం చదువుతారు. ఈ తీర్పులోని అశ్లీలతా నిర్వచనం కోసం చదువుతారు. ఇందులో కొన్ని చోట్ల ఒకే వాక్యం, కామాలు, పుల్‌స్టాప్‌లు (విరామచిహ్నాలు) లేకుండా పేజీలు కొనసాగుతుంది. ఒకచోటైతే నలభైనాలుగు పేజీల వరకు కొనసాగింది. అది చైతన్య స్రవంతి. (Stream of consciousness)

డబ్లిన్‌లో జూన్ 16, 1904 నాడు, లియోపాల్డ్ బ్లూమ్ జీవితంలో - ఇరవైనాలుగు గంటల్లో - జరిగిన సంఘటనలను ఇందులో వర్ణించాడు. ఈ నవలలో అనేక టెక్నిక్‌లను వాడాడు. ఈనవల హోమరు పురాణాన్ని ప్రకారణాదికంగా అనుసరించింది. చివరకు బ్లూమ్ తన ఇంటికి చేరి, మోలి (Molly) ని కలుసుకొంటాడు. మొదటి రోజుల్లో ఈ నవల అంతగా అర్థమయ్యేదికాదు. నవల మీద వచ్చిన వ్యాఖ్యానాలేవీ చదవకుండా, తిన్నగా దానిని చదవడానికి పూనుకొంటే, ఇప్పుడూ అర్థం కావడం కష్టమే.

జేమ్స్ జాయిస్ రాసిన "A Postrait of the Arist as a young Man' మూడో స్థానం ఆక్రమించింది. ఇది తరువాతి రచయితలకు మార్గనిర్దేశం చేసింది. ఒక యువకునిలో బౌద్ధిక

ుంది.

స్కాట్ ఫిట్జరాల్డ్ (Scott Fitzerald) రాసిన "The Great Gatsby రెండో గొప్పనవలగా ఎంపిక అయింది. ఈ నవల జాజ్ యుగ నిరర్థకతను, అప్రాముఖ్యతను తోలు ఒలిచి ప్రదర్శించింది. కాల్పనిక ప్రేమను, సమాజ శిష్టనాగరికతా పతనాన్ని ఇది వర్ణించింది.

నాలుగోది వ్లాదిమిర్ నబకోవ్ (Vladimir Nabakov) రాసిన లోలిట. ఈ నవలలో నాయకుడు మధ్య వయస్కుడు. పది పదకొండు సంవత్సరాలు దాటని బాలికవెంట మోహంతో గంగవెర్రులెత్తి పోతాడు. ఆ అమ్మాయి వెంటపడతాడు. దీనికెందుకు నాలుగోస్థానం లభించిందో అర్థంకాదు. ''బాలప్రేమ'' (Paedophilia) వెర్రితలలు వేసిందనేమో.

లోలిట దక్షిణ ఫ్రాన్స్‌లో 1920లో ప్రారంభమవుతుంది. పదమూడు సంవత్సరాల హంబర్ట్ హంబర్ట్, అతడి ప్రియురాలు చనిపోవడంతో, గకావికలైపోతాడు. అప్పటి నుంచి అతడి మనస్సు

ఈడొస్తున్న ఆడపిల్లల మీద చిక్కుకుపోతుంది. అంటే ఈతడు 12,13 ఏళ్ళ ఆడపిల్లల మీద స్థిరీభవన (Fixation) చెందుతాడు. ఆ తరువాత, ఇరవై ఐదు ఏళ్ళు గడిచిన తరువాత, అమెరికాలో ఒక కళాశాలలో పాఠాలు చెబడానికి కుదురుతాడు. అక్కడ చార్లొటీ హేజ్‌ను కలుస్తాడు. ఆమెకు దగ్గరవుతాడు. ఆమెను పెండ్లాడతాడు. ఇదంతా ఎందుకు చేశాడంటే, ఆమె పండ్రెండేండ్ల కూతురు లోలిటకు చేరువవ్వడానికే. చార్లొటీ రోడ్డు ప్రమాదంలో మరణిస్తుంది. దీనితో లోలిట దగ్గర పడుకోవడానికి అతడికి మార్గం సుగమమైంది. కాని ఈ పిల్ల అతనిని ప్రేమించదు. ఈమె ఒక యువకుణ్ణి పెళ్ళాడి అలాస్కా వెళ్ళిపోతుంది. ఈ యువకుణ్ణి పెళ్ళాడే ముందు ఒక నాటక రచయిత మీద తన ప్రేమను విసిరింది.

ఐదోస్థానం అల్డస్ హక్స్లీ రాసిన "Brave New World' కు వచ్చింది. రాబోయే విజ్ఞానశాస్త్ర, సామాజిక శాస్త్ర పరిణామాలు ప్రపంచాన్ని ఒకచేదు ఆటవిక ప్రపంచంగా మారుస్తాయనే అతని నమ్మకానికి ఆ నవల ప్రతీక. ఆనాడే అతడు టెస్ట్‌ట్యూబ్ బేబీలను, క్లోనింగ్‌ను ఊహించిరాశాడు. కావలసిన డిజైన్ ప్రకారం మనుషులను ఉత్పత్తి చేసే నాగరిత మీద ఇది వ్యంగ్య బాణం. మొత్తం మీద వారి ఎంపిక బాగుంది. సాల్మన్ రష్దీ రాసిన "Midnight Children' 90వ స్థానం ఆక్రమించింది.

---

*(Countinued from page 610)*

64. The Catcher in the Rye, *J.D.Salinger*
65. A Clockwork Orange, *Anthony Burgess*
66. Of Human Bondage, *W. Somerset Maugham*
67. Heart of Darkness, *Joseph Conrad*
68. Main Street, *Sinclair Lewis*
69. The House of Mirth, *Edith Wharton*
70. The Alexandria Quartet, *Lawrence Durrell*
71. A High Wind in Jamaica, *Richard Hughes*
72. A House for Mr. Biswas, *V.S. Naipaul*
73. The Day of the Locust, *Nathaniel West*
74. A Farewell to Arms, *Emest Hemingway*
75. Scoop, *Evelyn Waugh*
76. The Prime of Miss Jean Bordie, *Muriel Spark*
77. Finnegans Wake, *James Joyce*
78. Kim, *Rudyard Kipling*
79. A Room with a View, *E.M. Forster*
80. Brideshead Revisited, *Evelyn Waugh*
81. The Adventures of Augie March, *Saul Bellow*
82. Angle of Repose, *Wallace Stegner*
83. A Bend in the River, *V.S. Naipaul*
84. The Death of the Heart, *Elizabeth Bowen*
85. Lord Jim, *Joseph Conrad*
86. Ragtime, *E.L. Doctorow*
87. The Old Wives Tale, *Amold Bennett*
88. The Call of the Wild, *Jack London*
89. Loving, *Henry Green*
90. Midnight's Children, *Salman Rushdie*
91. Tobacco Road, *Erskine Caldwell*
92. Ironweed, *William Kennedy*
93. The Magus, *John Fowles*
94. Wide Sargasso Sea, *Jean Rhys*
95. Under the Net, *Iris Murdoch*
96. Sophie's Choice, *William Styron*
97. The Sheltering Sky, *Paul Bowles*
98. The Postman Always Rings Twice, *James M. Cain*
99. The Ginger Man, *J.P. Donleavy*
100. The Magnificent Ambersons, *Booth Tarkington*

# అంగీకారం

## (1966 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం)

మూలం :
శామ్యూల్ యోసెఫ్ అనాన్

అనువాదం :
బి. వెంకటరామిరెడ్డి

ధన్యవాదాలు చెప్పకుండా ఈ ప్రపంచంలో మనం ఏ సౌఖ్యాన్నీ పొందరాదని మనజ్ఞానులు అన్నారు. మనం భోజనం చేసినా, రుచికరమైన పానీయాన్ని సేవించినా, అందుకు ముందూ వెనుకా ధన్యవాదాలర్పించాలి. మనం గడ్డి సువాసనల్ని ఆఘ్రాణించినప్పుడూ, సుగంధద్రవ్యాల సుగంధాన్ని అనుభవించినప్పుడూ, మంచి ఫలాల తీపివాసనల్ని వాసనచూసినప్పుడూ, ధన్యవాదాలు చెబుతాం. ఇదే సూత్రం నేత్రానందానికీ వర్తిస్తుంది. సూర్యుడు వసంత ఋతువులో ఆకాశయానం చేస్తున్నప్పుడూ, వసంతంలో చెట్లు తమ ఆనందాన్ని పూలుగా విచ్చుకుని సుగంధాల్ని వెదజల్లినప్పుడూ మనం అలాంటి ధన్యవాదాలే చెబుతాము. అలాగే శ్రావ్యమైన సంగీతాన్ని విన్నప్పుడూ చేస్తాం. అలాగే మీ ద్వారా నేను నాకు సంబంధించిన ఆనందదాయకమైన ధన్యవాదాన్ని విన్నాను.

స్వీడిష్ అకాడెమీ నాకు నోబెల్ పురస్కారాన్ని ప్రసాదించింది. ఆవార్త వినగానే నేను ఆ శుభవార్తను విన్న ఆనందంలో ధన్యవాదాలు పలికాను. ''మంచి చేసేవాడు, మంచిగా జీవించేవాడు ధన్యుడు.'' పవిత్రమైన భాషలో రచనలు చేసే నాలాంటి రచయితకు ఇంత గొప్ప పురస్కారాన్నిచ్చిన ప్రసిద్ధమైన ఈ అకాడెమీ వారి హృదయాల్లో, ఆ నిర్ణయాన్ని కలిగించిన దేవునికి స్తోత్రము. నాకీ పురస్కారాన్నివ్వాలని వారిహృదయాల్లో ఆనిర్ణయాన్ని కలిగించిన దేవుడు మంచి చేశాడు. అందుకు దేవునికి స్తోత్రము. ''రక్తమాంసాల రాజైన మనిషికి నీ యొక్క ఔన్నత్యాన్ని ప్రసాదించినందుకు విశ్వచక్రవర్తివైన దేవా నీకు వందనములు.'' జ్ఞానం చేత ఋషితుల్యులూ, ప్రసిద్ధులూ అయిన మీ అకాడెమీ వారందరికీ ధన్యవాదాలు. ''రక్తమాంస శరీరుడైన మనిషికి తన ఔన్నత్యాన్ని ప్రసాదించిన దేవునికి స్తోత్రములు.''

జెరూసలెంలో ఒక ఆనవాయితీ ఉన్నది - జ్ఞానులు తమతో కలిసి కూచుని భోజనం చేసేవారెవరో తెలుసుకోనిదే భోజనానికి కూర్చోరు. ఈ ఆనవాయితీని గురించి 'టాల్మడ్' లో చెప్పబడింది. ఇప్పుడు మీరు నన్ను మీలో ఒకణ్ణిగా తీసుకున్నారు కాబట్టి ముందుగా నాగురించి మీకు తెలియజెప్పుకోవడం నా ధర్మంగా భావిస్తున్నాను.

రోమన్ చక్రవర్తి టైటస్ జెరూసలెంను జయించి ఇజ్రాయెల్‌ను జెరూసలెం నించి బహిష్కరించాడు. అలా బహిష్కరింపబడ్డ ఒకానొక పట్టణంలో నేను జన్మించాను. కాని నేనెప్పుడూ జెరూసలెంలో జన్మించిన వాడినిగానే భావించుకున్నాను. నేను నా సోదరుడు లెవిటిస్ తోబాటు పవిత్ర దేవాలయంలో ఉన్నట్టూ, ఇజ్రాయెల్ రాజైన డేవిడ్ మహారాజు పాటల్ని పాడుతున్నట్టూ కలగన్నాను. సంగీత దేవత గుడిని కనిపెట్టి ఉండే దేవదూతలు నేను కలలో పాడిన పాటల్ని మెళుకువలో కూడా పాడినట్లయితే, వాటిని నామాతృ దేశపు సోదరులు విన్నట్లయితే వాళ్ళు వాటిని విని భరించలేరనీ, ఎందుకంటే అవి వాళ్ళు పోగొట్టుకున్న సంతోషాన్ని గుర్తుచేసి బాధిస్తాయని భయపడి ఉంటారని అనుకుంటున్నాను. నన్ను పాడనివ్వకుండా చేసినందుకుగాను నన్ను ఓదార్చేందుకు ఆ దేవదూతలు నా చేత పాటలు వ్రాయించి ఉంటారు.

నేను 'లెవి' తెగకు చెందినవాణ్ణి. నా తాతముత్తాతలూ నేనూ ఆ గుడిలో గాయకులం. మేము శామ్యూల్ ప్రవక్త వంశీకులమని మా నాన్నగారి కుటుంబీకుల నమ్మకం. అందుకే నాకు ఆ ప్రవక్త పేరు పెట్టబడింది.

అయిదు సంవత్సరాల వయసులో నేను మొదటిపాట వ్రాశాను. ఆపాటను మా నాన్నగారిమీద తపనతో వ్రాశాను. మా నాన్నగారు పనిమీద దూరదేశం వెళ్ళారు. ఆయనమీది తపనతో ఆపాటవ్రాశాను. ఆ తరువాతనేను చాలా పాటలు వ్రాశాను. కాని, వాటిలో ఏవీమిగల్లేదు. నాపాటలన్నింటినీ మా నాన్నగారి ఇంట్లోనే వొదిలేశాను. మొదటి ప్రపంచయుద్ధంలో మా నాన్నగారి ఇల్లు తగులబెట్టబడింది. ఆ ఇంటితో బాటు నేనక్కడ వొదిలిన నారచనలన్నీ భస్మమైపోయాయి. యువకార్మికులు, దర్జీలు, చెప్పులుకుట్టేవాళ్ళు పనిచేసుకుంటూ నా పాటల్ని పాడుకుంటూ ఉండేవాళ్ళు. వాళ్ళు కూడా మొదటి ప్రపంచయుద్ధంలో చంపబడ్డారు. మరికొందరు వారి సోదరీమణులతో సహా తాము తవ్విన బొందల్లోనే సజీవసమాధి చేయబడ్డారు. ఎక్కువమంది ఆస్క్విజ్ శ్మశాన వాటికలో దహనం చేయబడ్డారు.

నేను తరువాత వ్రాసిన పుస్తకాలుకూడా నాపాటల్లాగే, వాటిని పాడుకున్నవాళ్ళలాగే తగులబడిపోయాయి. నేను హాస్పిటల్‌లో ఉన్న రోజుల్లో 'బాడ్ హాంబర్గ్'లో ఉన్న నా ఇల్లు తగులబడిపోయింది. అలా తగులబడి పోయిన పుస్తకాల్లో ఏడువందల పేజీల నవలకూడా ఉంది. దాని మొదటి భాగాన్ని ఒక పబ్లిషరు అచ్చువేస్తానన్నాడు కూడా. ' ఎటర్నల్ లైఫ్ ' అనే పేరు గల ఆ నవలతో బాటు మార్టిన్ బూబర్‌తో కలిసి నేను రచించిన పుస్తకం, నా తాతముత్తాతల నించి నాకు సంక్రమించిన నాలుగువేల హిబ్రూ పుస్తకాలు, నా కష్టార్జితంతో సంపాయించిన గ్రంథాలూ ఉన్నాయి.

నేను పందొమ్మిదిన్నర సంవత్సరాల వయసులో ఉండగా, వ్యవసాయం చేసుకుని బ్రతికేందుకు ఇజ్రాయెల్‌కు వెళ్ళాను. నాకు పనిదొరక్క వేరేవృత్తిని ఆశ్రయించాను. నేను 'లవర్స్ ఆఫ్ జియాన్' సొసైటీకి కార్యదర్శిగాను, 'పాలెస్తీనా కౌన్సిల్' కార్యదర్శిగాను, ''వాలంటరీ జ్యూయిష్ మాజిస్ట్రేట్ కోర్టు''కు మొదటి కార్యదర్శిగాను నియమింపబడ్డాను. ఆ సదవకాశం వల్ల, ప్రతియూదు జాతీయుణ్ణీ కలుసుకునే, తెలుసుకునే అవకాశం లభించింది. ఆ రోజుల్లో ఇజ్రాయెల్‌లో నాకు తెలయనివారు ఒక్కరూ లేరంటే అతిశయోక్తికాదు.

నా సమస్తమూ తగులబడిపోయినా దేవుడునాకు జెరూసలెంకు తిరిగివచ్చే జ్ఞానాన్ని ప్రసాదించాడు. జెరూసలెంకు తిరిగిరావడం వల్ల దేవుడు నా హృదయంలోకి, నాకలంలోకి ఏ శక్తిని నింపాడో దానిని అక్షరాల్లోకి మార్చగలిగాను. నేను ''గివింగ్ ఆఫ్ ది టోరా'', ''డేస్ ఆఫ్ ఆ!'' టోరా నుండి ఇప్పటి వరకు ఇజ్రాయెల్‌లో వొచ్చిన పుస్తకాలను గురించిన సమాచారంతో ఒక పుస్తకాన్ని వ్రాశాను.

నేను ఇజ్రాయెల్‌కు తిరిగి వొచ్చిన తరువాత రెండుసార్లు ఇజ్రాయెల్‌ను వొదిలివెళ్ళాను - జాల్మన్ స్కోకెన్ నా పుస్తకాలను అచ్చువేస్తున్నప్పుడు ఒకసారి, నార్వే, స్వీడన్ దేశాల్లో పర్యటనకు వెళ్ళినప్పుడు రెండోసారి. నార్వే, స్వీడన్‌లలోని గొప్పకవులు నాలో వాళ్ళదేశాల యెడల అభిమానాన్నీ, ప్రేమనూ నాలో పాదుకొలిపారు. అందుకే వాళ్ళదేశాలకువెళ్ళి వారిని చూడాలని నిర్ణయించుకున్నాను. ఇప్పుడు మూడోసారి మీరిచ్చిన ఈ పురస్కారాన్ని అందుకోవడానికి నాదేశాన్ని వొదిలి ఇక్కడికి వొచ్చాను.

నేను జెరూసలెంలో ఉన్న కాలంలో పెద్దకథల్ని, చిన్నకథల్ని రచించాను. వాటిలో కొన్ని అచ్చయ్యాయి. ఇంకా అచ్చుకావలసినవి చాలా మిగిలి ఉన్నాయి.

నామొదటి పాటల్ని మా నాన్నగారి మీద తపనతో వ్రాశానని చెప్పాను. నా పఠనం కూడా మా నాన్నగారితోనూ, మా బస్తీకి చెందిన రబ్బానికల్ జడ్జిగారితోను ఆరంభమయింది. నా మూడున్నర సంవత్సరాల వయసు నుండి నాకు ఎనిమిదిన్నర సంవత్సరాల వయసు వొచ్చేదాకా ముగ్గురు ట్యూటర్లు ఒకరితరువాత వొకరు వచ్చి బోధి స్తుండేవారు.

సాహిత్యంలోను కవిత్వంలోను నాకు అభి నివేశం కల్పించినదెవరు? ఈ విషయంలో భిన్నాభి ప్రాయాలున్నాయి. నా రచనల్లో కొందరికి నాకు తెలియని వారూ, ఎప్పుడూ పేరైనా విననివారి ప్రభావం కనుపిస్తే మరికొందరికి నేనెప్పుడూ చదవని కవుల ప్రభావం కనుపించింది! ప్రతి మనిషి తాను త్రాగిన పాలలోని ఒక్కొక్క చుక్క ఏయే ఆవుల నుండి పిదకబడ్డాయో గుర్తు తెచ్చుకోగలడా? నేను ఎవరివల్ల ప్రభావితుణ్ణైనానో మీకు తెలియజేస్తాను.

అక్షరాల కూర్పును మొట్టమొదటగా నేను పవిత్రగ్రంథాలనుండి నేర్చుకున్నాను. తరువాత మిష్నా, టాల్మడ్, మిద్రాషిమ్, టోరామీద రబ్బీ వ్యాఖ్యానం నన్ను ప్రభావితం చేశాయి. వాటి తరువాత పోష్కం, టల్మాడిక్‌లా, మధ్యయుగాలకు చెందిన జ్ఞానులు, పవిత్ర రచనలు చేసిన కవులు, మాస్టర్ రబ్బీమోజెస్ సన్ ఆఫ్ మెయిమాన్‌మొదలైనవారు నన్ను ప్రభావితం చేశారు.

హీబ్రూ కాక వేరే భాషల్లో వ్రాసేప్పుడు నాకుదొరికిన జర్మన్ గ్రంథాలు చదివి, నా ఆత్మకు నచ్చినవాటిని నాలోకి తీసుకున్నాను. నేను చదివిన పుస్తకాల పట్టీని ఏకరువు పెట్టదలచలేదు. నేను యూదు భాషాగ్రంథాలనే ఎందుకు ఉటంకించానంటే అవి నా సాహిత్యానికి పునాదులువేశాయి. నాకు నోబెల్ పురస్కారం లభించడానికి కారణం అవేనని నా హృదయం చెబుతోంది.

నా మీద ఇంకొక ప్రభావమూ ఉంది. నాకు జీవితంలో తారసపడ్డ ప్రతి పురుషుడు, స్త్రీ, పిల్లవాడు, యూదులూ, ఇతరులూ నన్ను ప్రభావితంచేశారు. వాళ్ళు చెప్పుకున్న గాథలు నా హృదయంలో హత్తుకుపోయాయి. వాటిలోకొన్ని నా రచనల్లో స్థానం సంపాదించుకున్నాయి. అలాగే ప్రకృతి దృశ్యాలుకూడా. ప్రతి ఉదయమూ నిద్రలేవగానే డాబా మీదినించి కనుపించే డెడ్‌సీ, నిత్యమూ నేను స్నానం చేసే ఆర్నాన్ సెలయేరూ, వెయిలింగ్‌వాల్ ప్రక్కన పూజ్యులైన మతపెద్దలతో గడిపిన రాత్రులు - ఇవన్నీ నా సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. ఆ గోడనీ, మా పట్టణాన్నీ మాకోసం నిర్మించిన దేవునికి ధన్యవాదాలు.

ఏ ప్రాణినీ తక్కువచేయడం నాకిష్టంలేదు. మనుషులతోబాటు మా ఇంటిలోని పెంపుడు జంతువులు, పక్షులు మొదలైన వాటినుండి నేను చాలానేర్చుకున్నాను. యోబు ఎప్పుడో చెప్పాడు (35:11) - ''ప్రపంచంలోని జంతువులకన్న ఎవరు మనకు ఎక్కువ బోధించగలరు? మనల్ని స్వర్గపుదేగలకన్న జ్ఞానులను చేయగలరు?'' వాటి నుండి నేను నేర్చుకున్న విషయాలను కొన్నింటిని నా పుస్తకాల్లో వ్రాశాను. కాని, ఒకకుక్క మొరిగినప్పుడు, ఒక పక్షి రెక్కలు విదిల్చినప్పుడు, ఒకకాకి అరిచినప్పుడు, అవి నాకు తమని గురించి వ్రాసినందుకు కృతజ్ఞతలు తెలుపుతున్నప్పుడు, తమను గుర్తించమని, తాము చెప్పేది వినమని అడిగినప్పుడు వాటికి సమాధానం చెప్పగలిగినంతగా నేను నేర్చుకోలేకపోయానని భయపడతాను.

ముగింపుకు ముందు మరో విషయం చెబుతాను - నన్ను గురించి నేను చాలా చెప్పుకున్నాను. మీకు తెలియజేసుకోవడం కోసం మాత్రమే అలా చెప్పుకోవలసి వచ్చింది. మీ దృష్టి నా మీద పడినందువల్ల చెప్పుకోవలసివచ్చింది. నేను చాలా అల్పుణ్ణి. నా జీవితంలో ఎప్పుడూ డేవిడ్ మహారాజు రచించిన భక్తిగీతాన్ని మర్చిపోలేదు. ''ప్రభువా! నా హృదయంలో గర్వంలేదు. నా కళ్ళు తలకెక్కలేదు. గొప్పవిషయాల్లో తలదూర్చలేదు. నన్నుమించిన విషయాల్లో జోక్యం చేసుకోలేదు.'' (131:1) నాకేమైనా గర్వంగా ఉందంటే అది దేవుడు మన తాతముత్తాతలకు ఈ భూమి మీద నివశించే అదృష్టాన్నీ అవకాశాన్నీ కల్పించినందుకు. ఇజీకియెల్‌లో చెప్పబడింది (37:25) - ''నేను నా సేవకుడైన యాకోబు కిచ్చిన భూమిమీదే మీ తండ్రులు, వారిపిల్లలు, వారిపిల్లల పిల్లలూ శాశ్వతంగా నివసిస్తారు.''

# పరిశోధన - విమర్శ

కన్నడ మూలం :                                                                 అనువాదం :
డా॥ యమ్. చిదానంమూర్తి                                                              ఘట్టమరాజు

'సృజనాత్మక పరిశోధన' అనే పదాన్ని కొంతమంది మాటలమధ్య ప్రస్తావించడంకద్దు. కాని ఆ పదాన్ని వాడే వాళ్ళందరికీ ఆ పద వ్యాప్తి గురించి సరైన అవగాహన వుందా అని నా అనుమానం. నాకు తెలిసినంతవరకూ ఆ పదాన్ని వాడినవాళ్ళలో చాలా మంది సాహిత్య విద్యార్థులే, 'పరిశోధన' అనే పదానికి ముందు 'సృజనాత్మక' అనే మాట చేర్చడంలో వాళ్ళకోవిధమైన ఆనందం; అలా ఆ పదం చేర్చడంవల్ల చాలామంది దృష్టిలో అంతగొప్పదికాని ప్రక్రియ అయిన 'పరిశోధన' కు ఏవో గౌరవ ప్రపత్తులు కల్పిస్తున్నామన్న తృప్తి. ఇలా అంటున్నానంటే కొంత వరకు అది నావూహ కావచ్చు. కాని 'సృజనాత్మక' పదం చేర్చడానికి ఓ స్పష్టమైన కారణముంది. సాహిత్యంలో సృజనాత్మక సాహిత్యం, విమర్శ అనే రెండు శాఖలున్నాయి. ఈ రెండింటిలో మొదటి దానికే పెద్దపీట. మొదటి దానిలో నెగ్గుకురాలేనివాడు రెండో దానిలో కృషిచేస్తాడనడంలో కొంత నిజం లేకపోలేదు. ఈ రెంటితోపాటు సాహిత్యంలో పరిశోధన అనేది కూడా వొకటుంది కదా? సాహిత్యవేత్తలు సాహిత్యాన్ని సృజనాత్మక, సృజనాత్మకేతర ( విమర్శ) అని రెండు భాగాలుగా విభజించుకొన్నారని తోస్తుంది. పైగా ఆ రెంటిలో సృజనాత్మక రచనలే గొప్పవని భావిస్తున్నట్లు భాసిస్తుంది.

అలా అనుకొంటే పరిశోధన అనేదంతా ఏదో ఒక విధంగా సృజనత్మకమే. ఇలా అంటున్నానంటే పరిశోధనకు ఓస్థానాన్ని కాని, విశిష్టతను కాని కల్పించడానికి ప్రయత్నిస్తున్నానని భావించకండి. కళలు తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ పరిశోధన వొక్కటే విశిష్టమైన అంశం. ఆ రంగంలో పరిశోధకులుంటారు లేదా పాఠ్య పుస్తక రచయితలుంటారు. పరిశోధకులు కొత్త అంశాల్ని అన్వేషిస్తారు. తద్వారా వున్న జ్ఞానాన్ని పెంపొందిస్తారు. ఆయా కాలంలో వికసిస్తున్న జ్ఞానాన్ని క్రోడీకరించి, దాన్ని విడమరచి చెప్పేవారు పాఠ్యపుస్తక రచయితలు, ఈ ఇద్దరి కృషి గౌరవించదగినదీ, పరస్పర పూర్వకమైనదీను. కాని ఈ ఇద్దరిలో పరిశోధకునికి ఎక్కువ గౌరవాదరాలు లభిస్తాయంటే ఆశ్చర్యపడాల్సిన పనేమీలేదు. ఆర్థిక, సాంఘిక, మనశ్శాస్త్రంలాంటి సామాజిక శాస్త్రాల్లోకానీ, భౌతిక, రసాయన శాస్త్రాల్లాంటి భౌతిక విజ్ఞానంలోకానీ, వృక్షశాస్త్రం లాంటి జీవశాస్త్రంలో కానీ రచనా వ్యాసంగం చేపట్టేవాళ్ళు రెండురకాలు - పరిశోధకులు, పాఠ్యపుస్తక రచయితలు. ( అంతగా కావలిస్తే, జనప్రియ రచయితలు (Popular Writers) అనే ఓ వర్గాన్ని చేర్చుకోండి) అంటే ఈ రంగాల్లో పరిశోధనకు ప్రబలమైన పోటీదారు కాదుకదా, అసలు పోటీదారేలేడు. అందువల్ల ఈ రంగాల్లో పరిశోధకులకు, పరిశోధనలకు అగ్రతాంబూలం.

ఇదేమాట సాహిత్యం లాంటి 'సృజనాత్మక' కార్యకలాపాల కళా మాధ్యమ క్షేత్రాలకు వర్తించదు. ఇక్కడ పరిశోధనకు తీవ్ర పోటీదారులు ( ఈ మాటను ఆక్షేపించేవాళ్ళు నేను ముందు చెప్పబోయే వివరణ చూడండి) సృజనాత్మక సాహిత్యం ( కావ్యం, నాటకం, నవల, కథ మొదలైనవి) విమర్శ. సృజనాత్మక సాహిత్యం వ్యక్తి అంతరంగం మూల పదార్థంగా సృష్టిపబడింది. దాన్ని సృష్టించిన రచయిత తన సాహిత్య సృష్టికి బాహ్యాధారాల్ని ఎవరికీ చెప్పాల్సిన అవసరం లేదు. కథానికను సృష్టించిన రచయిత నిత్య జీవితంలో తాను చూసిన ఏఘటననో, ఘటనలనో ఆధారంగా గ్రహించినా, ఆ రచన ఆ ఘటనకు

నూటికి నూరుపాళ్ళు ప్రమాణంగా వుండాల్సిన పనిలేదు. అంతేకాదు, తన రచనకు ప్రేరణ ఇచ్చిన ఘటనను రచయిత సాధారణంగా అక్షరబద్ధం చేయడు. ఒకవేళ ఆ ఘటనను అలా అక్షరబద్ధం చేసినా, ఆ ఘటన రచనాకృతి ధరించినప్పుడు ఎలాంటి మార్పులకు లోనయిందో తెలుసుకొనేవాళ్ళకు మేత దొరుకుతుందేమో కాని ఆరచన విలువ కట్టేందుకు ఉపయోగపడదు. ఇక రచనను ఆస్వాదించేందుకు ఇది బొత్తిగా సహకరించదు. ( ఓ మూల కృతి వస్తువు ఆధారంగా రచింపబడ్డ మరో రచనపట్ల ఇది అన్వయించదు) ఇంతకీ, ఈ చర్చ సారాంశమేమంటే, సృజనాత్మక రచనను ఆకళకు సంబంధించిన ఆంతరంగిక ప్రమాణాలతోనే కొలవాలి కాని దానితో ప్రత్యక్ష సంబంధంలేని అంశాల్ని దానికి అన్వయించకూడదు.

విమర్శ సృజనాత్మక సాహిత్యంపై ఆధారపడి వుంటుంది. అలాంటి సాహిత్యమే లేకుంటే, అసలు విమర్శ అనేదే వుండదు. విమర్శ ఓ రచయితను సరిగ్గా అర్థం చేసుకొనేందుకు ఉపయోగపడుతుంది అనడంలోనే అది ఆలోచనపై ఆధారపడి వుందన్న సంగతి తెలుస్తుంది. ఓ రచనను వేర్వేరు కోణాల్లోంచి విశ్లేషించి, అది ఓ అనుభవాన్ని ఎలా కలిగించింది, ( లేదా కలిగించలేదు), రచయిత ఆశయం నెరవేరిందా లేదా మొదలైన విషయాల్ని చర్చించవచ్చు. ఆ రచన విలువను అంచనా వేయవచ్చు. ఇంతకీ చెప్పవచ్చిందేమంటే విమర్శ సాహిత్యాన్ని అనుసరించి జరిగే క్రియ అనడమే, సాహిత్య ప్రపంచంలో ఉత్తమ విమర్శకు, విమర్శకునికి గౌరవాదరాలు లభించినా, ఉత్తమ సృజనాత్మక రచనల, రచయితల తర్వాతి స్థానమే దొరుకుతుందన్న మాట మాత్రం తిరుగులేని సత్యం.

ఈ నేపథ్యంలో పరిశోధనను పరిశీలించాలి. సాహిత్య ప్రయోజనం రసానుభూతి ( దీన్ని ఇతర శాస్త్రాల కంటే భిన్నమైన ఓ విశిష్ట శాస్త్రమనీ, 'కళాత్మక శాస్త్ర' మనీ అన్నా తప్పులేదు) విమర్శ సాహిత్య ప్రయోజనానికి దగ్గరైనదని భావింపబడటంవల్ల, అవి రెండూ నేరుగా పరస్పరం సంబంధించిన కార్యకలాపాలుగా పరిగణింపబడ్డాయి. పరిశోధన సాహిత్య ప్రయోజననికి చాలా దూరంగా వుంటుందని ఎక్కువగా భావించడంవల్ల, దాన్ని సాహిత్యానికి దూరంగా వుంచుతున్నాం. సాహిత్య ప్రపంచంలో పరిశోధనకు గౌరవాదరాలు అంతంతమాత్రమే. వెనుక ఓసారి నేను 'పోటీదారులు' అన్న పదం వాడాను. పరిశోధనకు సాహిత్యం, విమర్శ క్రూరశత్రువులు, అది వాటి చేతుల్లో వోడిపోయిందన్న ధ్వని నేను వుద్దేశించకున్నా వెలువడిందేమో! ఈ అనుమానం నన్ను పీడిస్తూండటంవల్ల దాన్ని స్పష్టం చేయడం నాధర్మం. సాహిత్య ప్రపంచంలో సాహిత్యానికీ, విమర్శకూ వున్న ప్రాధాన్యం పరిశోధనకు లేదన్న సంగతి కన్నడంలో మాత్రం నిజం. ఇది సమంజసమా? అందుకు కారణాలేమిటి? ఆ అభిప్రాయం కలగడానికి పరిశోధకులు ఎంత వరకు బాధ్యులు? లేదా పరిశోధన గురించి ఇతరులకు సరైన అవగాహన లేకపోవడం కొంతవరకు కారణమా? మొదలైన విషయాల గురించి పరిశోధించడం అవసరం. కన్నడ సాహిత్యంలో కృషిచేయాలనుకున్న వ్యక్తి మొదట సృజనాత్మక రచయిత కావాలనుకొంటాడు. పరిశోధకులు కావాలనుకొనేవాళ్ళు చాలా అరుదు. పరిశోధన సాహిత్యానికి పూర్తిగా భిన్నమైన, నీరసమైన పని అని చాలా మంది భావన. పరిశోధనా రంగం ఎక్కువ సంఖ్యలో ప్రతి భావంతుల్ని ఆకర్షించలేకపోవడంవల్ల ఆక్షేత్రానికి అపారనష్టంకలిగింది. ఇతరక్షేత్రాల్లో అద్వితీయమైన, అత్యాధునికమైన కార్యకలాపంగా ప్రసిద్ధి చెందిన పరిశోధనకు సాహిత్య ప్రపంచంలో ఇలాంటి దుస్థితి కలగడం విచారకరం. అన్ని క్షేత్రాలూ సమానమైన గౌరవాదరాలకు అర్హత కలిగి వున్నాయని అనడం ఓ ఆదర్శం మాత్రమే. కాని అసలు స్థితి వేరే. పరిశోధన సాహిత్యానికి చాలా

దూరంగా వున్న ప్రక్రియ? పరిశోధన, విమర్శ నిజంగా వేర్వేరు ప్రక్రియలా? పరిశోధనను చేపట్టేవాడు. అసాహిత్యవేత్త అయివుండాలా? లేదా దాన్ని చేపట్టిన సాహివేత్తను 'అసాహిత్యవేత్త' చేసే మోడీ దానికి వుందా? పరిశోధన సాహిత్య ప్రయోజనానికి దూరంగా వుంటుందా? లేదా ఆ ప్రయోజనాన్ని కలిగిచడంలో అది తన పాత్రను ఎంతవరకు నిర్వహించకలుగుతూంది? లేదా ఈ ప్రశ్నలే పనికిరానివా? లేదా పరిశోధన స్వరూప స్వభావాల గురించి సరైన అవగాహన లేకపోవడమే దీనంతటికీ కారణమా? పరిశోధన నిజంగా గౌరవనీయమైన, అవసరమైన సాహిత్యప్రక్రియ అని ప్రామాణికంగా భావించేవాళ్ళ మనస్సుల్లో కూడా ఇది సాహిత్యేతర ప్రక్రియ అనే ఓరకమైన తాత్సారభావం నెలకొనివుంది.

'తాత్సార' మనే పదానికంటే నయమైన, నాజూకైన మంచిపదముంటే బాగుండేది. సాహిత్యవేత్తలు కానివ్వండి, విమర్శకులు కానివ్వండి - పరిశోధకులను తాత్సారంగా చూస్తారంటే తప్పవుతుంది. అయినా, వాళ్ళకు తెలియకుండానే పరిశోధన, పరిశోధకులపట్ల ఓరకమైన విముఖత వాళ్ళల్లో వున్నమాటవాస్తవమే. ఆ మనస్తత్వాన్ని వెల్లడించడానికి సమర్థమైన మరోపదం నాకు కనపడదు. ఇలా అంటున్నప్పుడు నాకెలాంటి అసమాధానం, అసంతృప్తి లేదు. ఓ సత్యాన్ని నిరూపిస్తున్నానన్న భావన మాత్రం నా మనస్సులో వుందని గ్రహించాలి.

నేను పరిశోధన పరంగా వకాలత్తు మోంచి, దానికిగౌరవం సంపాదించిపెట్టే ప్రయత్నం చేస్తున్నానని ఎవరూ భావించరని ఆశిస్తాను. కొన్ని అపోహల్ని తొలగించడానికి ప్రయత్నిస్తున్నాను. అంతేకాదు. నా మాటలు సాహిత్యక్షేత్రానికి మాత్రమే పరిమితమైనవని గ్రహించాలి సుమా! ఎందుకంటారా? పరిశోధన అన్నిటికి సంబంధించిన కృషి, సాహిత్యాన్నే మూలద్రవ్యంగా పెట్టుకొని, సాహిత్య ప్రయోజనానికి దూరంగా వుండే పరిశోధనలూ వున్నాయి. ఉదాహరణానికి సాహిత్యాన్ని భాషా శాస్త్రవేత్తలు, జానపద విద్వాంసులు, చరిత్రకారులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు, తమకు అనుగుణంగా మలచుకోవచ్చు. ఇలాంటి పరిశీలనల్ని గమనించడం వల్ల సాహిత్య విద్యార్థులకు ప్రయోజనం చేకూరుతుంది. ఈ రోజుల్లో ఏ విషయం కాని సర్వతంత్ర స్వతంత్రంగా మనజాలదు. వృక్షశాస్త్రజ్ఞులు పంప, హరిహరుల కవిత్వాన్ని చదివి ఆనందించగలరు. వృక్షశాస్త్రజ్ఞుల రచనలు చదివితే సాహిత్య విద్యార్థులకు కూడా లాభం చేకూరుతుంది. ఇది అటుంచండి ఇంతకీ నేను చెప్పవచ్చింది ఏమిటంటే పరిశోధన అనేది సాహిత్యాన్నే ఆధారంగా సాగే ఓ స్వతంత్ర కార్యకలాపం. కాని సాహిత్యప్రయోజనానికి అనుగుణంగా పరిశోధన ఎలా సాపేక్షమయిందన్న సంగతి గురించి కొంత ముచ్చటించుకోవాలి.

పరిశోధన - విమర్శ మూలతః భిన్న కార్యకలాపాలు కాదు. అవి రెండూ సాహిత్యాన్ని అవగాహన చేసుకొనేందుకు, విశ్లేషించేందుకు తోడ్పడతాయి. అంతేకాదు, చాలా సందర్భాల్లో అవి విడదీయరానంతగా ఒకదానితో వొకటి అల్లిబిల్లిగా అల్లుకొనిపోయి వుంటాయి. కొన్ని సార్లు అవి రెండూ ఒకటిగానే వుంటాయి. ఒక దాన్ని ఇంకొకటి ఛేదించుకొని పొయ్యే, రెండు వృత్తాల మధ్య ప్రదేశం ఆ రెండు వృత్తాలకూ సంబంధించినట్లుగా, పరిశోధనకూ విమర్శకూ సమానంగా సంబంధించివుండే క్షేత్రాలుంటాయి. సాహిత్యచరిత్ర ఇందుకు మంచి ఉదాహరణ. ఏ సాహిత్య చరిత్రకాని వొట్టి పరిశోధనా కాదు, వొట్టి విమర్శాకాదు. సాహిత్యచరిత్ర పరిశోధన, విమర్శల మేలుకలయిక. సాహిత్యానికి నేపథ్యమైన రాజకీయ, సాంఘిక, మతశక్తుల పరస్పర ప్రతిక్రియలు, కవి దేశకాల పరిస్థితులు, ఆకరాలు మొదలైన వాటి వివేచన చేయడం వల్ల అది పరిశోధన. ఓ రచన విశ్లేషణా,

దాని వైశిష్ట్యాన్ని అంచనా వేయడం వల్ల అది విమర్శ. సమగ్ర సాహిత్య వికాసానికి ఇవి రెండూ ఎంతో దోహదం చేస్తాయి. అంతే కాక సాహిత్య చరిత్రలో పరిశోధన, విమర్శలను సులభంగా వేరుపరచలేం. కావ్యమీమాంస పరిశోధనా అవుతుంది; విమర్శా అవుతుంది. విశిష్ట రచనల విశ్లేషణ కంటే సాహిత్యం రూపుదాల్చే విధానం, సాహిత్య లక్షణాలు, భాషా శాస్త్రీయ విశ్లేషణ, అనుభవాన్ని మనస్తత్వశాస్త్ర దృక్పథంతో వివేచించే విధానం మొదలైన సామాన్య విషయాల చర్చ జరుగుతుంది కాబట్టి అది పరిశోధనా అవుతుంది. కావ్య భాష విశ్లేషణ విమర్శ అవుతుందని గమనించినప్పుడు కావ్యమీమాంస పరిశోధనా? లేదా విమర్శా? అని ప్రశ్నిస్తే చటుక్కున సమాధానం చెప్పడం కష్టం. రెండు సమాధానాలూ సరైనవే అనొచ్చు. లేదా రెండూ తప్పే అనీ చెప్పొచ్చు. లేదా ఏ వొక్కదాన్నో లేకపోతే రెంటినీ సమర్థించుకోవచ్చు. పోతే కావ్యమీమాంస పరిశోధనా కాదు, విమర్శాకాదు. అనీ వాదించేందుకు బోలెడంత అవకాశముంది.

ఒకవి దేశకాలాదుల చర్చనిజంగా పరిశోధనే; ఓ రచన విశ్లేషణ నిజంగా విమర్శే. పరిశోధన, విమర్శలను ఇలా విడదీయడం అవసరమూ, హేతుబద్ధమూనూ, కాని అలాంటి విభజనను మరింత లాగడం అపాయకరం. అవి రెండూ పరస్పరం కలుస్తాయనీ, ఒకదాని క్షేత్రాన్ని మరొకటి ఛేదించుకొని పోతాయనీ, రెంటికీ దగ్గరి సంబంధముందనీ, రెండూ వొకటి కాగలవనీ లోగడ తెలుసుకొన్నాం. పరిశోధన అంటే కవిదేశకాలాదులు, రాజకీయ, మత, సాంఘిక పరిస్థితులు, శబ్దార్థనిర్ణయం, పాఠాంతర పరిశీలన మాత్రమే అనే అపోహవల్ల వొనగూడిన నష్టం అనూహ్యం. పరిశోధకులంటే ఆధునికతకు దూరమైన, రసహీనమైన విషయాల్నే చర్చించే శుష్కపండితులన్న భావన చాలామందికుంది. పై అపోహల వల్ల ప్రతిభావంతులు పరిశోధనా క్షేత్రంలో ప్రవేశించడానికి సందేహిస్తారు. ఆ విషయం గురించి వివరంగా చర్చించడానికి నేను ఇష్టపడను; సులభంగా కీర్తి గడించాలనే కండూతి, తక్కువ పరిశ్రమ మొదలైన ఆకర్షణల వల్ల సాహిత్య క్షేత్రంలోని ఇతర ప్రక్రియలపట్ల చూపినంత ఉత్సాహం, ఆసక్తి, పరిశోధనా రంగం పట్ల ప్రదర్శించరు. కారణాలు ఏవైనా వుండొచ్చుకాక, చాలామంది ప్రతిభావంతుల్ని కోల్పోయి, పరిశోధనా క్షేత్రం అపారనష్టం అనుభవించిందన్నదే నాబాధ.

దేశకాల సాంఘిక రాజకీయ, మత పరిస్థితులు తెలుసుకొంటే కాని ఏ ప్రాచీన సాహిత్యాన్ని కాని సరిగ్గా అర్థం చేసుకోలేం. ఓ కవికాలం తెలియకపోతే అతని గురించి అర్థవంతమైన చర్చ చెయ్యాలన్నా, అతని రచనల్ని సరిగ్గా విమర్శించాలన్నా కష్టం. ఓ ఉదాహరణ ద్వారా ఈ సంగతి ఎలా స్పష్టం అవుతుందో చూద్దాం. ప్రాచీనకవి పంపడి గురించి మనం ఎంతైనా చర్చించవచ్చు. అతని దేశకాలాలు, జన్మస్థలం, తల్లిదండ్రులు, తమ్ముడు, కులగోత్రాలు, ఆశ్రయదాత, సామాజిక నేపథ్యం మొదలైన విషయాలు తెలుసుకొన్నాం. అతని కావ్యభాష అయిన బెళ్వోల కన్నడం దూరదేశమైన ఆంధ్రలో వున్న పంపడికి ఎలా కరతలామలకం అయిందో వివరించగల స్థితిలో వున్నాం. ఆ కవి గురించి తెలుసుకోద్గగసంగతులు ఎన్నో వున్నాయన్న మాట వాస్తవమే అయినా మన అదృష్టం కొద్దీ కన్నడసాహిత్య చరిత్రలో పంపడు అనామకుడిగా నిలిచిపోలేదు. ఒకవేళ అతని రెండు కావ్యాలు లభ్యమయ్యీ, వాటిలో అతని జీవితం గురించి ఎలాంటి ప్రస్తావనా లేదనుకోండి. అలాంటప్పుడు పంపడి రచనల గురించి మాట్లాడ్డం ఎంత కష్టమో వూహించుకోండి. కవి జీవితవిశేషాలు, దేశకాలపరిస్థితులు ఇవి కవిని ఓ నిర్దిష్టమైన స్థానంలో వుంచి పరిశీలించేందుకు చాలా వుపకరిస్తాయి. చేపనో, అడవి జంతువునో, అది నివసించే నీటిలోనూ,

అరణ్యంలోనూ చూచినట్లవుతుంది. కేవలం ఓ కవి రచన మాత్రమే లభించి, అతని గురించి ఎలాంటి సమాచారమూ అందకపోతే, చేపనూ అడవి జంతువును ప్రత్యేకమైన గాజుపెట్టెలోనో, బోనులోనో పెట్టి చూసినట్లవుతుంది. 'వడ్డారాధన' ఇందుకు ఓ మంచి ఉదాహరణ. అత్యంతశ్రేష్ఠమైన ఈ ప్రాచీన గద్యరచన పేరు, కర్త దేశకాలాదుల గురించి మనకు ఏమీ స్పష్టంగా తెలియదు. అంతా అనుమానాల పుట్ట. 19 కథలు దొరికాయన్న దొక్కటే సమాధానకర విషయం. 'వడ్డారాధన' కథనశైలి, గద్య సౌందర్యం గురించి మాట్లాడుకోవచ్చు. మరింత లోతుకు వెళ్లాలనుకొంటే, ఆ రచన దేశకాల పరిస్థితుల నేపథ్యం తెలియనందువల్ల, దొరికిన దానితోనే తృప్తిపడాల్సి వస్తుంది. పంప మహాకవి గురించి విలువైన విమర్శ రావడానికీ, 'వడ్డారధన' గురించి రాకపోవడానికీ గల కారణాల్లో 'వడ్డారాధన' రచనానేపథ్యం అజ్ఞాతంగా వుండిపోవడం వొకటి. చరిత్ర, శాసనాలు పంపమహాకవి నేపథ్యాన్ని స్పష్టం చేశాయి. గ్రంథ పరిష్కరణ వల్ల పంపడి కావ్యంలో చాలావరకు సరైన పాఠాలు గుర్తించబడ్డాయి. జినసేన, వ్యాసులతో పోల్చి చూడటం వల్ల అతని కావ్యవైశిష్ట్యం స్పష్టమయింది. పరిశోధనల వల్ల వడ్డారాధన గురించి మరిన్ని విషయాలు బయటపడినప్పుడు దాన్ని కూడా చక్కగా విశ్లేషించేందుకు అవకాశం కలుగుతుంది. 'వడ్డారాధన' సరైన పాఠం లభించిందన్న తృప్తి తప్ప, మిగతాదంతే అతృప్తికరమే.

అంబిగర (జాలరి) చౌడయ్య గురించి ఎలాంటి సమాచారమూ లభించలేదు. చివరికి అతని గురించి ఎలాంటి కట్టుకథలూ దొరకలేదు. ఈ కారణాలవల్ల ఆప్రముఖ వీరశైవకవి పాఠకులకు సన్నిహితం కాలేకపొయ్యాడు. పరిశోధనల వల్ల ఏమైనా ఎక్కువ సమాచారం లభిస్తే, అంబిగర చౌడయ్య, అతని కవిత్వం గురించి పరిశీలించడానికి వీలవుతుంది.

పరిశోధన, విమర్శలు బౌద్ధిక కార్య కలాపాలు. విమర్శ సాహిత్యాన్ని అనుభవనిరూపణంగా దర్శిస్తుంది. సాహిత్యాన్ని ఓ అనుభవంగా అవగాహన చేసుకోవడానికి, విశ్లేషించడానికి బేరీజు వేయడానికి సహకరిస్తుంది. వస్త్వాశ్రయ విమర్శ అనేది ఇంకా రూపొందలేదు. అంటే ఓ రచన స్వరూపం, విలువల్ని వివరించే సర్వజనసమ్మతమైన సూత్రాలు ఇంకా ఏర్పడలేదు. అది అసాధ్యం కూడా. పైగా అనవసరమన్నా తప్పు లేదనుకొంటాను. ఓ రచన లేదా కళాఖండం పాఠకులకు లేదా చూసేవాళ్లకు కాలకాలానికి వేర్వేరుగా భాసించడం సాధ్యమైనప్పుడు, ఒకేవ్యక్తి ఒకరచన లేదా కళాఖండం గురించి వేర్వేరు కాలాల్లో విధవిధాలుగా అభిప్రాయాలు వ్యక్తం చేసే అవకాశం వున్నప్పుడు, భిన్న కాలాల్లో వ్యక్తులు లేదా ఒకే కాలంలో భిన్నవ్యక్తులు భిన్న భిన్న అభిప్రాయాలు కలిగివుండటం సాధ్యం కదా. పైగా వాస్తవం కూడాను. ఇలా ఓ రచన గురించి పాఠకులు భిన్న భిన్న అభిప్రాయాలు కలిగివుండటం సాహిత్యరీత్యా తప్పుగా కాని, కొరతగా కాని భావించరాదు.

పరిశోధన సాహిత్యకృతిని ఓసిద్ధిగా భావిస్తుంది. విమర్శలాగానే పరిశోధన కూడా సాహిత్యాన్ని వేర్వేరు కోణాలనుంచి ప్రకాశమానమయ్యేలా చేస్తుంది. వస్తునిష్ఠంగా వున్నప్పుడే ఆ పని నెరవేరగలదు. పరిశోధనల ఫలితం అందరి ఆమోదం పొందాలి. అలా జరగనప్పుడు దాన్ని అక్కడే సూచించాలి. అంటే పరిశోధన ఫలితాల్ని ఇతరులు బేరీజు వేస్తారన్న మాట. ఓ పరిశోధకుడు సాక్ష్యాధారాల వల్ల నిర్దిష్టమైన నిర్ణయానికి వస్తే, ఆ సాక్ష్యాధారాలు మరో పరిశోధకునికి అదే నిర్దిష్ట నిర్ణయానికి రావడానికి తోడ్పడాలి. (సాక్ష్యాధారాలు నమ్మదగ్గవి కావాలి సుమా).

అంటే ఒకే రకమైన సాక్ష్యాధారాలను ఆశ్రయించి ఒకరు ఒకలా, మరొకరు ఇంకోలా తీర్మానించరాదు. పరిశోధన విధాన మంటే ఇదే. అయితే ఇక్కడ కూడా అపవాదాలు వుంటాయి. పరిశోధకులు ఒకే రకమైన సాక్ష్యాధారాలను వేర్వేరు విధంగా వ్యాఖ్యానించే అవకాశాలు లేకపోలేదు. కాని విమర్శనారంగంలో వున్నట్లు వ్యక్తిగత అభి రుచులకు ఇక్కడ స్థానముండదు. ఇది ఆదర్శం. దీన్ని సాధించే కొద్దీ పరిశోధకుని స్థాయి పెరుగుతుంది.

పరిశోధన విమర్శ ప్రమేయం లేకుండా స్వతంత్రంగా సాగుతుంది. అంటే పరిశోధకునికి విమర్శతో పరిచయం ఉన్నా లేకున్నా ఫరవాలేదన్నమాట. ఒకవేళ అతనికి సాహిత్య విమర్శా పరిజ్ఞానం వుంటే, అతని పరిశోధనకే లాభం. ఎందుకంటారా? పరిశోధకునికి ఏది అవసరం? ఏది అనవసరం? అనే ప్రశ్న పొడమదు. అంటే విమర్శ సాయం లేకుండానే అతని పని సజావుగా సాగిపోతుందన్న మాట. కాని పరిశోధన తోడ్పాటు లేకుండా సాహిత్య విమర్శ సాగుతుందనుకోవటం పొరపాటు. ఓ కావ్యం శుద్ధప్రతి నుంచి కావ్యనేపథ్యం వరకు ఆ రచన ఆస్వాదనకు అవసరమైన సకల సామగ్రి పరిశోధన కర్మాగారం నుంచే సరఫరా కావాలి. కొత్త కొత్త పరిశోధనలు విమర్శలోని కొంగ్రొత్త కోణాల్ని దర్శించేందుకు వుపకరిస్తాయి. విమర్శకంటే పరిశోధనదే పైచెయ్యి అని నేను నిరూపించడానికి ప్రయత్నిస్తున్నానని భావించకండి. ఏది ఉత్తమమైనదో, ఏది కాదో తేల్చుకొనడం కంటే ఏది మొదటో, ఏది కాదో తెలుసుకొనడమో, లేదా ఏయే ప్రక్రియ స్వరూపస్వభావాలు ఎలా వుంటాయో గ్రహించడం ముఖ్యమని నేను భావిస్తాను. విమర్శలోని కొత్తదారుల వల్ల పరిశోధనపై ఎలాంటి ప్రభావమూ ప్రసరించదు. ఎందుకంటారా? పరిశోధన విమర్శ ప్రమేయం లేని స్వతంత్ర ప్రక్రియ. కాని కొత్త పరిశోధనలు ఓరచనను పరిశీలించే దృక్పథాన్ని మార్చగలవు. అంటే ఏ విమర్శ అయినా సరే కాలక్రమంలో జరిగే పరిశోధనల్ని గమనిస్తూ, తద్వారా లబ్ధిపొందుతూ అభి వృద్ధి చెందాలన్నమాట. ఓ రచను కాని, ఓ రచయితను కాని సరిగ్గా అవగాహన చేసుకోవాలంటే పరిశోధన అందించే సహకారాన్ని స్వీకరిస్తూ విమర్శ ముందుకు సాగుతుందన్న విషయం గమనించాలి.

కొన్ని ఉదాహరణాల్ని పరిశీలిద్దాం. పంపమహాకవి తమ్ముడైన జినవల్లభుని శాసనం లభించడం వల్ల, పంపడి తల్లి ధార్వాడ జిల్లా అణ్ణిగేరికి చెందినదన్న సంగతి తెలిసి, పంపడికి కర్నాటకకు ప్రత్యక్ష సంబంధం ఏర్పడింది. అందువల్ల అతని కావ్యభాష పులిగెరె కన్నడం అన్న అతని మాట అర్థవంతమై ప్రకాశించింది. పంపడి భాషను విశ్లేషించే విద్వాంసులు పై అంశాన్ని గమనించకుండా వుండలేరు. పదకొండవ శతాబ్దంలో అందులోనూ - ఆరవ విక్రమాదిత్యుని కాలంలో బ్రాహ్మణులకు మునుపెన్నడూ లేనన్ని అగ్రహారాలు కానుకలు, అధికారాలు, హోదాలు లభించాయని పరిశోధనలు వెల్లడిస్తాయి. ఈ పరిశోధన 12వ శతాబ్దంలో జరిగిన వీరశైవ వుద్యమాన్ని అర్థం చేసుకోవడానికి ఎన్నో విలువైన సూచనల్ని అందజేస్తుంది. అల్లమప్రభు ఓ సామాన్య కుటుంబంలో బహుశా శూద్రకులంలో పుట్టిన కవి అన్న సంగతి అతని వచనాలకు వున్నత స్థానం కల్పిస్తుంది. ' ఎనగెయూ గొగేశ్వర లింగక్కెయూ ఎత్తణ దెత్తణ సంబంధవయ్యా' (నాకూ గొగేశ్వర లింగానికీ, ఎక్కడెక్కడి సంబంధమయ్యా?) అన్న మాట సహజమనిపిస్తుంది. (శూద్రుడైన అల్లమ ప్రభువుకు అనిమిషయ్య వల్ల ఇష్టలింగప్రాప్తి కలగటం నమ్మశక్యం కాని ఓ ఘటన!) దేవర దాసిమయ్య వేరే, జేడర దాసిమయ్య వేరే, జేడర దాసిమయ్య బసవేశ్వరుని సమకాలీనుడైన వచనకారుడని ఇటీవలి పరిశోధనలో బయటపడటం వల్ల దాసిమయ్యకు వచన వుద్యమ పరిధి లోకి తెచ్చి నిలుపుతుంది. ' ఉళ్ళవరు

శివాలయ మాడువరు' (కలిగిన వాళ్లు శివాలయం నిర్మిస్తారు) అనే బసవణ్ణ వచనాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే ఆ శతాబ్దంలోని లకులీశ - పాశుపత సంప్రదాయాలకు పెట్టనికోట ల్లాంటి దేవాలయ సంప్రదాయాల్ని అవగతం చేసుకొనటం తప్పనిసరి పరిశోధన వెలుగు రేఖలు ప్రసరించటం వల్ల సాహిత్యం మరింత అర్థవంతమై భాసిస్తుందన్న సత్యం విస్మరించరానిది.

అంటే సాహిత్యం అర్థవంతం కావాలన్న ఉద్దేశ్యంతోనే పరిశోధన సాగుతుందని భావించరాదు. నేను నా అభిప్రాయాన్ని స్పష్టం చేయకపోతే పాఠకులు అపార్థం చేసుకొనే ప్రమాదముంది. కొత్త జ్ఞానం, కొత్త దృక్పథం కలిగించడమే పరిశోధన లక్ష్యం. వాస్తవాన్ని వెలికితీయడమే దాని ఆశయం. అలా చేయడం వల్ల కలిగే పరిణామం ఎలాంటిది? ప్రయోజనం ఏమిటి? అనే ప్రశ్నలు పరిశోధకునికి అప్రస్తుతం. తన పరిశోధన వల్ల సాహిత్యవిమర్శకు లేదా సాహిత్య ఆస్వాదనకు లాభం చేకూరితే అతడు ఎంతో సంతోషిస్తాడు. అతని పరిశోధన ఫలితమే ఆ ఆనందం. కాని అతను మొదట్లోనే అలాంటి నిర్దిష్టలక్ష్యాన్ని పెట్టుకొని రంగంలోకి దిగడు; అలా దిగాల్సిన అవసరం లేదన్న సంగతి గమనార్హం. సత్యాన్ని..... సత్యాన్ని మాత్రమే అన్వేషించడమే అతని లక్ష్యం.

పరిశోధన ఆరాధ్యదైవం సత్యం యొక్క సౌందర్యం; విమర్శ ఆరాధ్యదైవం సౌందర్యం యొక్క సత్యం. సత్యం యొక్క సౌందర్యం, సౌందర్యం యొక్క సత్యం మాటల స్థాయిలోనే కాక, ఆంతరంగికంగా కూడా ఒక దానితో ఇంకొకటి పెనవేసుకొని వుంటాయన్న సంగతి గమనించాలి.

విమర్శ, పరిశోధనలు మూలతః వేర్వేరు ప్రక్రియలుగా కనపడవు. ఆ రెంటికీ వుండే తేడా స్థూలమైనదే. పైగా సందర్భాను సారమైనదీనూ, రెంటిలోనూ విషయసేకరణ, విశ్లేషణ, అభ్యూహ (Hypothesis) పునఃపరిశీలన, సంయోజన (Synthesis) వుంటాయి. విమర్శ ఒక రచన లేదా కొన్ని రచనలకు నిబద్ధమై సాగుతుందనుకొన్నా, అదికూడా వాటికి సంబంధి ంచని ఎంతో సామగ్రిసాయం పొందుతుంది. విమర్శ కూడా పరిశోధన లాగానే తన నిర్ణయాలు, ఫలితాలు సార్వకాలికసత్యాలు కావాలని ఆశిస్తుంది. ఆ కోరిక నెరవేరనీ, నెరవేరకపోనీ! తాను చేసిన విమర్శ తనకు మాత్రం నచ్చుతుందనీ, ఇతరులకు కానీ, మరో కాలానికి కానీ నచ్చకపోవచ్చనీ ఏ విమర్శకుడూ భావించడు. అతి శ్రేష్ఠమైన విమర్శ పరిశోధన లాగానే, అన్ని కాలాలకూ అన్వయించే సత్యాల్ని ప్రతిపాదించవచ్చు. కాని అన్ని కాలాలకూ నిజంగా నిలిచిపోవాలన్నదే విమర్శ ఆశయం కాదు.

పై అభిప్రాయంతో కొందరు ఏకీభవించవచ్చు; మరికొందరు వ్యతిరేకించవచ్చు. విధానాన్ని (Process) గమనిస్తే, సాహితీవిమర్శ, పరిశోధనలు ఒకే రకమైన ప్రక్రియలు. విమర్శ, పరిశోధనల్లో అనుభవం లేదా వస్తువిశ్లేషణ (Analysis) ఓ ఘట్టం; వాటి సంయోజన (Synthesis) మరో ఘట్టం. ఈ విశ్లేషణ, సంయోజన - రెండూ ప్రతిభాస్థాయిలోనే జరుగుతాయి. భిన్న భిన్న మూలాల నుంచి వచ్చిన ఈ విడిఘటకాలు ఇక్కడ సమగ్రంగా సంయోజితమవుతాయి. 'సృజనాత్మక' సాహిత్యంలో కూడా ఈ క్రియ వేరేస్థాయిలో ప్రజ్ఞకు అవతలి వలయంలో జరుగుతుంది. సాహిత్యంలో మనకు సంయోజితమై వెలువడ్డ సిద్ధవస్తువు ముఖ్యమవుతుంది; విమర్శ, పరిశోధనల్లో సిద్ధవస్తువు లాగానే, అది తయారుకావడానికి వుపయోగింపబడ్డ సామగ్రి, విధానం కూడా గమనార్హం అవుతాయి.

అలాంటప్పుడు సాహిత్యం, విమర్శ, పరిశోధనలకున్న మూలవ్యత్యాసం బహిరంగమైనదేనా? 'సృజనాత్మక' మన్న విశేషణం మూడింటికీ అన్వయిస్తుందా? ఔననిపిస్తుంది. చర్చించాలి మరి.

# ప్రాచీన కామ కళాసాహిత్యం

– కె. జితేంద్రబాబు

ప్రాచీన కాలంలో భారతీయులు కామాన్ని గురించి క్రమ పద్ధతిలో అధ్యయనం చేసి ఒక శాస్త్రంగా అభి వృద్ధి చేశారు. శారదా తనయుడు తన భావ ప్రకాశిక నందు ''సౌఖ్యాభి మాన సంకల్ప ఫ లవాన్ కామ ఇష్యతే'' అని కామాన్ని గూర్చి పలికాడు. కామాన్ని సుఖ సంవేదనా రూపమైన సంకల్పమగు రతి. భారతీయులు కామంను పురుషార్థాలలో మూడవ పురుషార్థంగా చేర్చి గౌరవించారు. అందువలన వాత్స్యాయనుడు తన కామసూత్రాలలో సాధారణాధి కరణమును ప్రారంభిస్తూ ''ధర్మార్థ కామేభ్యోనమః'' ధర్మం కొరకు అర్థం కొరకు కామం కొరకు నమస్కరిస్తున్నాను అన్నాడు. ధర్మం జ్ఞానం నుండి వస్తుంది అని భావించి భారతీయులు జ్ఞానానికి ప్రథమ స్థానం కల్పించారు. అర్థం సమాజాన్ని నడుపుతుంది. కామం సమాజాన్ని నిలుపుతుంది అందువల్ల వీటికి తర్వాత స్థానాలను కల్పించారు. ఈ మూడు పురుషార్థాలను త్రివర్గమని ఈ త్రివర్గ ప్రతి పత్తిగల శాస్త్రాన్ని కామశాస్త్రం అని పిలుస్తారు. వాత్స్యాయనుడు ''శతాయుర్వై పురుషః విభజ్యకాల మన్యోన్యాను బద్ధం, పరస్పర స్యానుపఘాతకం, త్రివర్గం, సేవేత'', అనగా శతాయు ప్రమాణం గల పురుషుడు తన జీవితకాలాన్ని ఈ త్రివర్గ ప్రతిపత్తి ప్రకారం విభజించుకొని ఒకదానితో ఒకటి సంబంధం కలిగి యుండేటట్లుగా, ఒకదానితో ఒకటి విరుద్ధం కాకుండా సేవించాలని తన కామసూత్రాలలో సాధారణాధి కరణంను ప్రారంభిస్తు అన్నాడు.

ఈ కామ సూత్రాలకు వ్యాఖ్యానం రచించిన యశోధరుడు తన ''జయమంగళ వ్యాఖ్య'' నందు ''ఉపాయ పరిజ్ఞానం చ కామశాస్త్ర దేవన ధర్మశాస్త్రాత్, నాపిచార్థ శాస్త్రాత్'' అని పలికాడు. కామం ఉపాయం లేనిదే సిద్ధించదు కాబట్టి, ఈ ఉపాయమును తెలుసుకొనుట కామశాస్త్రం వల్లనే సాధ్యమగుతుంది. ధర్మశాస్త్రం వల్ల, అర్థశాస్త్రం వల్ల వీలుగాదు అని భావించి వాత్స్యాయనుడు సంప్రయోగసిద్ధి గల కామశాస్త్రంను నిర్మించినట్లు తెలపినాడు. పూర్వాచార్యులు నిర్మించిన సిద్ధాంతాలను ఆధారంగా జేసుకొని వాత్స్యాయనుడు తన సూత్రాలను నిర్మించినట్లు యశోధరుడు తనవ్యాఖ్యలో పేర్కొన్నాడు. ఏ శాస్త్రాన్నయినా శాస్త్రీయంగా అధ్యయనం చేయాలి అన్న భావన వాత్స్యాయనుడు కామసూత్రాలు వ్రాసే నాటికే ప్రచారంలో ఉంది. ఆ విషయాన్ని గూర్చి యశోధరుడు కామ సూత్రాలను వ్రాసిన జయమంగళ వ్యాఖ్యలో ఇలా అంటాడు.

శ్లో॥ యదవిజ్ఞాత శాస్త్రేణ కదాచిత్సాధితం భవేత్,<br>
నచైత ద్బహుమంతవ్యం ఘుణోత్కీర్ణమి వాఽక్షరమ్.

శాస్త్రార్థం తెలువని వాని చేత ఎప్పుడైనా ఏదైనా శాస్త్రార్థం సాధింపబడితే అది పురుగుల చేత తొలవబడిన అక్షరము వలె అంత గొప్పగా తలంపదగినది కాదు' అని పలికాడు. కామాన్ని నిరసించడం అంటే ప్రకృతి ధర్మాన్ని వ్యతిరేకించడమే అని ప్రాచీన కాలంలో భారతీయులు తలచారు. నిరంతరం జన జీవన వాహిని కొనసాగాలంటే కామ కళా విజ్ఞానం అత్యంత అవసరమని భావించారు. అందువల్ల కామ కళా విజ్ఞానాన్ని సాహిత్యంలోనూ, కళలలోనూ, శిల్పంలోనూ, అంతర్లీనంగా ప్రమోంపజేశారు. భవభూతి, కాళిదాసు, దండి వరహమి హిరాచార్యుల రచనలలో, నాట్య శాస్త్రంలో, అలంకార

శాస్త్రంలో ఖజరహో, కాళహస్తి లాంటి దేవాలయాల్లో ప్రతిమలను శిల్పులు స్థాపించుటలోనూ కామకళా విజ్ఞానంను మనం గమనించవచ్చు.

మనకు లభ్యమయిన గ్రంథాలలో ప్రాచీనమైనది వాత్స్యాయనుడు రచించిన కామసూత్రాలు, మనకు చరిత్రలో ముగ్గురు వాత్స్యాయనులు కన్పించుతున్నారు. ''వాత్స్యాయనస్తు కౌటిల్యో విష్ణుగుప్తో వరాణకః, ద్రమిళః పక్షిల స్వామీ మల్ల నాగోంగు శోపిచ'' అనుశ్లోకం వల్ల అర్థశాస్త్రం రచించిన కౌటిల్యునికి కూడా వాత్స్యాయనుడు అను పేరు ఉన్నట్లు తెలుస్తుంది. న్యాయశాస్త్రభాష్యకారుడు వాత్స్యాయనుడు రెండవవాడు. ఈ కామసూత్రాలు రచించిన వాత్స్యాయనుడు మూడవవాడు. ఇతని కాల న్నిర్ణయం చేయటం చాలా కష్టం, అయితే ధర్మ శాస్త్రం రచించిన మనువు తర్వాత జన్మించినాడని మాత్రం చెప్పవచ్చు. కొందరు వాత్స్యాయనుడు, కౌటిల్యుడు వేరు కాదు ఒకరే అన్నారు. ఆ చర్చ ఇప్పుడు అప్రస్తుతం.

వాత్స్యాయనుడు తన గ్రంథంలో తనకు పూర్వం గల కామశాస్త్రగ్రంథాలను వారి సిద్ధాంతాలను తెలియజేశాడు. అతడు ''ప్రజాపతిర్హి ప్రజాస్సృష్ట్వాతాసాం స్థితి నిబంధనం త్రివర్గస్య సాధన మధ్యాయానాం శత సహస్రేణాగ్రే ప్రోవాచ'' ప్రజాపతి ప్రజలను సృష్టించి త్రివర్గ సాధనం కొరకు లక్ష అధ్యాయాలతో స్థితి బంధనమనే శాస్త్రాన్ని చెప్పాడని వాత్స్యాయనుడు తెలియజెసాడు. దానినుండి మనువు ధర్మశాస్త్రంను, బృహస్పతి అర్థశాస్త్రంను, నంది కేశ్వరుడు కామశాస్త్రంను రచించినారని తెలియజేసినాడు. ఈ నంది కేశ్వరుని కామశాస్త్రంను ఆధారంజేసుకొని తొమ్మిది మంది కామ శాస్త్రా చార్యులు తమ సిద్ధాంతాలను రచించినారు. వీరిలో ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు తన సిద్ధాంతంను అయిదు అధ్యాయాలుగా విభజించాడు. ఇతడు ఈ గ్రంథం రచించుటకు కారణం మహాభారతం ఆది పర్వం (అధ్యా 5.21)నందు తెలియజేయబడింది. అందు శ్వేతకేతువు తల్లిని ఒకతను బలాత్కారముగా తీసుకొని వెళ్ళటంచూసి సమాజాన్ని కట్టుబాటులో ఉంచాలనే ఉద్దేశముతో బలాత్కార సంయోగాన్ని ఆపాలని భావించి వివాహవ్యవస్థను ఏర్పరిచినట్లు తెలియజేయబడింది. ఈ విషయాన్ని, శ్వేతకేతువు కామశాస్త్రం రచించుటకు పూర్వం వ్యవస్థ ఇలా ఉన్నది అని తెలుపుతూ 'జయ మంగళ వ్యాఖ్య' నందు యశోధరుడు ఈ క్రింది శ్లోకంను వ్రాశాడు.

శ్లో॥ పక్వాన్న మివ రాజేంద్ర! సర్వసాధారణాస్త్రియః
తస్మాత్తాసు న కుప్యేత నరజ్యేత రమేతచ - ఇతి.

'' ఓ రాజేంద్ర పక్వాన్న మెట్లయితే తర తమ భేదములేక సర్వసాధారణమై అందరికి అనుభవింప నర్హమైయున్నదో, అట్లే స్త్రీలును సర్వ సాధారుణులు. వారి విషయములో పురుషులు నేరారోపణ చేసి కుపితులు, విముఖులు, కారాదు. కేవలం వారి రమింప వలసింది మాత్రమే''. ఇలా ఉన్న లోకాచారాన్ని శ్వేత కేతువు సంస్కరించి, నూతన వ్యవస్థను నిర్మించినట్లును, ఆ వ్యవస్థగూర్చి.

శ్లో॥ మద్య పానాన్ని వృత్తిశ్చ బ్రాహ్మణానాం గురోస్సుతాత్
పరస్త్రీభ్యశ్చ లోకానా మృషేరౌద్దాలకే రపి
తతః పితు రనుజ్ఞానా ద్గమ్యాగమ్యా వ్యవస్థయా
శ్వేతకేతు స్తపోనిష్ఠః సుఖం శాస్త్రం నిబద్ధవాన్. ఇతి.

లోకులను మద్యపానము నుండి, అధమవర్ణం వారు ఉత్తమ వర్ణం వారైన బ్రాహ్మణుల, గురువుల వారి కన్యలను వివాహము ఆడు ఆచారం నుండి, పరస్త్రీ గమనం నుండి, లోకులను సంస్కరించదలచి తన తండ్రి ఆజ్ఞతీసుకొని లోకములో గమ్యాగమ్య వ్యవస్థను ఏర్పరిచి కామశాస్త్రంను రచించి తపోనిష్ఠుడై ఉండెనని భావం - శ్వేతకేతువు తనకు పూర్వం గల వ్యవస్థను సంస్కరించి పశు ప్రవృత్తి నుండి స్థితి బంధన హేతువైన వివాహసంస్కారాన్ని ఏర్పరచినాడని జయమంగళ వ్యాఖ్యలో పేర్కొనబడింది.

శ్వేతకేతువు రచించిన కామశాస్త్రం పంచాధ్యాయాలను తీసుకొని సాధారణాధికరణం, సాంప్రయోగికాధికరణం, కన్యా సంప్రయుక్త కాధికరణం, భార్యాధికరణం, పార దారికాధికరణం, వైశికాధి కరణం, ఔపనిషధి కాధికరణం అనే ఏడు అధికరణాలుగా బభ్రువను వాని కుమారుడు బాభ్రవ్యుడు రచించినాడు. ఇతడు పాంచాల దేశస్థుడు. దత్తకుడును వాడు పాటలీపుత్రం నందలి వేశ్యల కొరకు, వారి కోరికపై బాభ్రవ్యుడు రచించిన గ్రంథము నుండి వైశికాధి కరణమును తీసుకొని ప్రత్యేక గ్రంథంగా రచించాడు. ఇతడు పాటలీ పుత్రంనందు నివసించే మాధురుడు అను బ్రాహ్మణుని కుమారుడు. అతనికి వృద్ధాప్యంలో జన్మించుటవలన పుట్టిన వెంటనే తల్లి, తరువాత తండ్రి మరణించుటవలన పాటలీ పుత్రంలో నివసించే బ్రాహ్మణి ఒకామె ఇతనిని దయతో తీసుకొని దత్తకుడని పేరు పెట్టినది. ఇతడు ఆనాడు సమస్త విద్యాపారంగతుడై దత్తాకాచార్యుడని పేరుమోసి ప్రఖ్యాతుడగుట వలన పాటలీ పుత్రం నందలి వేశ్యలు వచ్చి తమకొరకు 'పురుషరంజనం' తెలిపే ఒక ప్రత్యేక గ్రంథంను రచింపమని కోరగా దత్తకాచార్యుడు ఈ గ్రంథంను రచించినాడని కథ. ఈ కథ బౌద్ధ గ్రంథములలో 'గుణభద్రసూరిది'గా కూడ తెలుపబడింది. దత్తకుని గ్రంథం నేడు అలభ్యమయినప్పటికీ నరేశ్వరదత్తుని ''ధూర్త విటసంవాదం' నందు కొన్ని సూక్తులు దత్తకాచార్యునివిగా చెప్పబడినవి కలవు.

చారాయణుడు అను నతడు బాభ్రవ్యుని గ్రంథంలోని సాధారణాధికరణమును, సువర్ణనాభుడు అనునతడు సాంప్రయోగికాధికరణంను, ఘోటకముఖుడు అనునతడు కన్యాసంప్ర యుక్తాధికరణంను, గోనర్దీయుడు అనువాడు, భార్యాధికణంను, గోణికాపుత్రుడు పారదారి కాధి కరణంను, కౌచుమారుడు అను వాడు ఔపనిషది కాధి కరణంను ప్రత్యేక గ్రంథాలుగా రచించినారని వాత్స్యాయనుడు తన కామసూత్రాలలో పేర్కొన్నాడు. ఈ సూత్రాచార్యుల గ్రంథాలు ఏవి ఇప్పుడు లభ్యమగుటలేదు. అయితే క్రీ.శ, 11,12 శతాబ్దాల మధ్య జీవించిన యశోధరుడు తన 'జయమంగళ వ్యాఖ్యనందు తాను, దత్తకుని, బాభ్రవ్యుని గ్రంథాలను చూసినట్లు తెలియజేసాడు. వాత్స్యాయనుడు పైన పేర్కొన్న తొమ్మండుగురు సూత్రకారుల గ్రంథాలలోని పిండితార్థమును సంగ్రహంగా తన కామసూత్రాలలో తెలియజేసినట్లు పేర్కొన్నాడు. గంగ వంశంనకు చెందిన కళింగ రాజైన రెండవ మాధవ వర్మ దత్తకుని సూత్రాలకు శ్లోకమయమైన వ్యాఖ్య రచించాడు. ఆగ్రంథం సంపూర్ణంగా లభ్యమగుట లేదు. వేశ్యల గురించి శయనోపచారాదికాల గురించి మాత్రమే లభ్యమగుచున్నది.

ఘోటకముఖుని ప్రస్తావన కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఉన్నది. ఇతను కూడా అర్థశాస్త్రం రచించినట్లు కౌటిల్యుడు ప్రస్తావించాడు. స్త్రీలను మొట్టమొదటిసారిగా, పద్మిని (Lotus Woman), చిత్రిణి (Art-Woman), శంఖిని (Conch Woman), హస్తిని (She - elephant woman) అనే నాలుగు విభాగాలుగా విభజించాడు. తర్వాత వచ్చిన కామశాస్త్ర కారులు దీనిని అనుసరించారు.

కొక్కోకుడు ఘోటక ముఖుని గ్రంథంను చూచినట్లు తన 'రతిరహస్యం'లో పేర్కొన్నాడు.

వాత్స్యాయన కామసూత్రాలకు చాలామంది వ్యాఖ్యలు రచించినా, యశోధరుడి 'జయమంగళ' వ్యాఖ్య మాత్రమే బాగా ప్రాచుర్యం పొందింది. దానినే తర్వాత వచ్చిన కామశాస్త్ర చార్యులు ఎక్కువగా అనుసరించారు. యశోధరుడు తన జయమంగళ వ్యాఖ్యలో ''వాత్స్యాయనీయం కిల కామసూత్రం, వ్యాఖ్యాయ తత్రైకైశ్చిది హోధేన్య థైవ, తస్మాద్విధాస్యే జయమంగళాఖ్యాం, టీకా మిమాం సర్వ విదం ప్రణమ్య'' అనుటవలన వాత్స్యాయనీయాని సంప్రదాయ విరుద్ధమైన వ్యాఖ్యలు చాలా ఉన్నాయని, అందువల్ల తాను సంప్రదాయ బద్ధంగా వ్యాఖ్యానం చేస్తున్నట్లు పేర్కొన్నాడు. గ్రంథాంతంలో తనను గూర్చి '' ఇతి శ్రీ వాత్స్యాయనీయం కామసూత్ర టీకాయాం జయమంగళాభి ధానాయాం, విదగ్ధాంగనా విరహ కాతరేణ గురుదత్తేంద్ర పతాభి దానేన యశోధ రేణ ఏకతకృత సూత్ర భాష్యేయాం'' అని వ్రాసుకొన్నాడు. జయమంగళ వ్యాఖ్యతో వాత్స్యాయన కామసూత్రాలను తెలుగులోనికి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి అనువదించి వివరణలతో 1924లోను 1930లోను ప్రచురించారు. మేడిచర్ల ఆంజనేయమూర్తి వాత్స్యాయన కామసూత్రాలను జయమంగళ వ్యాఖ్య ఆధారంగా అనువదించి ప్రచురించారు. ఇదిగాక వాత్స్యాయన కామసూత్రాలకు అనేక వ్యాఖ్యలున్నాయి. వాటిలో కొన్నిటిని మనం పరిశీలిద్దాం.

కందర్ప చూడామణి అను పేర వీరభద్రుడనునతడు వాత్స్యాయన కామసూత్రాలకు ఆర్యా వృత్తాల్లో వ్యాఖ్యానం రచించాడు. ఇతడు క్రీ.శ. 1577 ప్రాంతం వాడు. గ్రంథాంత శ్లోకంలో తన కాలం గూర్చి ప్రస్తావించాడు. కాశీనందు 17వ శతాబ్దిలో నివసించిన బాస్కరసింహుడనే తెలుగు బ్రాహ్మణుడు ''వాత్స్యాయనసూత్రవృత్తి'' అను పేరున కామసూత్రాలకు వాఖ్యానం రచించాడు. అతను కాశీపట్టణం నందు నివసించే వజ్రలాల్ అనే వ్యాపార ప్రముఖుడి వల్ల రచించినట్లు గ్రంథాంతంలో గల శ్లో॥ శ్రీ సర్వేశ్వర వాంఛి తార్థ - శాస్త్రి సద్గురు మహ కారుణ్యా సాహోయ్యతిః శ్రీ రాజ వజ్రలాల సాదర్ ముహుస్సంప్రేషణా దీక్షణాత్. శ్రీ కాశ్యాం నరసింహశాస్త్రి కవినా కందర్ప చూడామణేః శ్రీ వాత్స్యాయన సూత్ర వృత్తి రఖిల ప్రౌఢ ప్రియా లిఖ్యతే! అని వ్రాయుట వలన తెలుస్తుంది.

తర్వాత పేర్కొనదగిన గ్రంథం 'నాగరసర్వస్వం'. దీనిని 'పద్మశ్రీ' అనే బౌద్ధ భిక్షువు రచించాడు. - ఇది కుట్టినీ మతానుసారముగా వ్రాయబడింది. జ్యోతిర్మల్లుడను వాడు ఈ ''నాగర సర్వస్వం'' నకు వ్యాఖ్య రచించాడు. వాత్స్యాయన కామసూత్రాలననుసరించి 11వ శతాబ్దిలో కాశ్మీర్‌నేలిన అనంతదేవుని ఆస్థాన పండితుడు 'క్షేమేంద్రుడు' వాత్స్యాయన సూత్రసారము, సమయమాత్రకము అనే రెండు గ్రంథాలు రచించాడు. సమయమాత్రకమును, 'కళావిలాసం' అని కూడా పిలుస్తారు. ఇతని శైలిని తెలుసుకొనుటకు వాత్స్యాయన సూత్రసారంలోని ఈ

శ్లో॥ కామః కామం కమల వదనానేత్ర పర్యంత వాసీ
దాసీ భూత త్రిభువనజనః ప్రీతి యే జాయతాంతః;
దగ్ధస్యాపి త్రిపురరిపుణా సర్వలోక స్పృహార్హా
యస్యాధిక్యం రుచి రతి తరాం మజ్జన స్యేవయాతా.

శ్లోకంను గమనింపవచ్చు

వాత్స్యాయన కామసూత్రాల తర్వాత బాగా ప్రాచుర్యం పొందిన గ్రంథం కొక్కోకకుడు రచించిన 'రతిరహస్యం', ఇతడు సింహళ దేశీయుడు. ఈ గ్రంథం కామసూత్రాలకు సంక్షిప్తరూపం, ఈ కొక్కోకకుడు కామశాస్త్ర ప్రయోజనం గురించి నూతనంగా నిర్వచించి తర్వాత వచ్చిన కామశాస్త్రాచార్యులకు మార్గదర్శి అయినాడు అతడు కామశాస్త్ర ప్రయోజనం తెల్పుతూ ''అసాధ్యాయా స్సుఖం సిద్ధి సాధ్యాయాశ్చాను రంజనం రక్తాయాశ్చ రతి సమ్యక్కామ శాస్త్ర ప్రయోజనం'' అని పలికినాడు. ఈ రతిరహస్యంలోని శ్లోకాలను కోలాచల మల్లినాధ సూరి తన రచనలలో ఉదహరించాడు. ఇతడు కీరాతార్జునీయానికి, రఘువంశంనకు వ్యాఖ్యానం రచించాడు. అదేవిధంగా 'నైషదీయాని'కి వ్యాఖ్యానం రచించిననారాయణ భట్టు, గీతగోవిందానికి వ్యాఖ్యానం రచించిన 'కుంభన్నపతి' కూడా కొక్కోకకుడు రచించిన గ్రంథం నుండి శ్లోకాలను స్వీకరించి తమ గ్రంథాలలో ఉదహరించారు. యశోధరుడు 'జయమంగళ వ్యాఖ్య'నందు కొక్కోకకుడి 'రతిరహస్య' ప్రశంస చేసినాడు.

ఈ 'రతి రహస్యానికి' కాంఛీనాధుడనువాడు 'రతిరహస్య దీపిక' అను పేర వ్యాఖ్యానం రచించాడు. ఈ గ్రంథం నందు 156 అధికరణాలున్నాయి. ఈ గ్రంథ ప్రయోజనాన్ని గూర్చి తెలుపుతూ

శ్లో॥ యద్వాత్స్యాయన సూత్ర సంగ్ర హూబహిర్భూతంకి మప్యాగమే:
దృష్టం వాచ్య మిదం మయాముని గిరాం శ్రద్ధాహి సాధారణీ

అంటూ వ్రాయుట వలన ఈ వ్యాఖ్య కామశాస్త్రం తెలియని మంద బుద్ధుల కొరకు వాత్స్యాయన కామసూత్రాల నుండి ఇతర గ్రంథాలనుండి సంక్షిప్తీకరించి తెలుపుతున్నట్లు గమనింపవచ్చు. హరిహరుడనువాడు కొక్కోకకుని 'రతిరహస్యానికి' 'శృంగార బంధుదీపిక' అనుపేర వ్యాఖ్యరచించాడు. ఇందలి 56 శ్లోకాలు మాత్రమే లభ్యమగుచున్నవి. దీనిపై అనేక మంది టీకలు వ్రాసియున్నారు.

ఈ గ్రంథం మొదటి పరిచ్ఛేదం పూర్తిగాను, రెండవ పరిచ్ఛేదం అసంపూర్ణంగా లభ్యమగుచున్నది. కవి ప్రభుడు అనువాడు దీనిపై రచించిన 'రతిరహస్య టీక' చాలా ప్రాచుర్యం పొందింది. ఆ వంచరామచంద్రుడు కొక్కోకకుడి 'రతిరహస్యం' నకు 'రతిరహస్య వ్యాఖ్య' పేరున వ్యాఖ్యానం రచించాడు. ఈ గ్రంథం కూడా బాగా ప్రాచుర్యం పొందింది.

కొక్కోకకుడి 'రతిరహస్యం' తర్వాత బాగా ప్రచారం పొందిన గ్రంథం 'అనంగ రంగం' ఈ గ్రంథం క్రీ.శ.15 లేక 16 శతాబ్దాల మధ్య జీవించిన 'కళ్యాణ మల్లు' డనే బ్రాహ్మణునిచే వ్రాయబడింది. ఈ గ్రంథాంతంలో ఉన్న శ్లోకంను బట్టి ఇతడు 'లోడి' వంశపాలకుడైన 'మహ్మద్ షా' కాలం వాడని తెలియుచున్నది. ఇతని శైలిని గమనించుటకు

శ్లో॥ ఉన్నిద్రాంబుజ కోశతుల్య వదనా రమ్యా మరాళస్వనా
తన్వీ హంస పధాగతి స్సులలితం వేషం సదాభి భ్రతీ
మధ్యం చాపి వళిత్రయాంకితతనుః శుక్లాం బరా కాంక్షిణీ
సుగ్రీవా శుభ నాసికేతి గదియానార్యుత్తమా పద్మినీ''.

ఈ గ్రంథం తెలుగు అనువాదంలో పాండుచ్చేరి నందు 1924లో ప్రచురింపబడింది.

తర్వాత పేర్కొనదగిన గ్రంథం జ్యోతీశ్వరాచార్యుడు రచించిన 'పంచసాయకం'. ఈ గ్రంథం కూడా పాండుచ్చేరి నందు ప్రచురించబడింది. ఇది వాత్స్యాయనుని పద్ధతిలోనే రచింపబడిన శ్లోక రూపమైన గ్రంథం. జ్యోతీశ్వరాచార్యుడు తనను గూర్చి ఈ గ్రంథంలో

శ్లో॥ అస్తి ప్రత్యహమర్థి తాపహరణే ప్రీత్యైక దీక్షా గురుః
శ్రీకంఠార్చన తత్పరో భువి చతుష్షష్టేః కళా నాం నిధి :,

సంగీతామృత సత్ప్రమేయ రచనా చాతుర్య చింతామణిః
ప్రఖ్యాతః కవి శేఖరార్చిత పద్మశ్రీ జ్యోతీరీశః కృతిః''.

అని తెలుపుట వలన ఇతడు శ్రీశైవార్చనా తత్పరుడని చతుష్షష్టి కళా ప్రవీణుడని, సంగీతాగమజ్ఞాన రచనా చాతుర్య చింతామణియని, కవి శేఖర పదలాంఛితుడు అని అర్థం.

మీన నాథుడనువాడు 'రతిరత్న ప్రదీపిక' అనే పేరుగల కామ శాస్త్ర గ్రంథం రచించాడు. ఈ గ్రంథం దేనికి అనుకరణగాదు స్వతంత్రమైన గ్రంథం. దీనిలో దాదాపు 500 శ్లోకములున్నాయి. ఇదే పేరుగల వేరొక గ్రంథం మైసూర్ పాలకుడైన శ్రీ దేవరాజు మహారాజు రచించాడు. ఈ గ్రంథంను కామగ్రంథమాలవారు పాండుచ్చేరి నందు 1924లో చిత్రాలతో ప్రచురించారు. తెలుగు అనువాదంతో లభ్యమగుచున్నది. ఇందులో సాంప్రయోగాధి కరణము మాత్రమే ఉన్నది. మిగతాభాగాములు లోప్తమై ఉండవచ్చు.

రుద్రకవి అనునతడు 'స్మరదీపిక' అను గ్రంథంను రచించాడు. ఈ గ్రంథం పూర్తిగా లభ్యం కావటం లేదు. ఇతడు క్రీ.శ. 1764 ప్రాంతంలో నివసించాడు. ఈ శైలి తెలుసుకొనుటకు ఈ గ్రంథంనందలి కొన్ని శ్లోకాలు.

శ్లో॥ అనేక కామశాస్త్రాణాం సార మాకృష్య యత్నతః,
బాలవ్యుత్పత్తియే స్త్రీణాం చిత్తసంతోషణాయచ.

శ్లో॥ నానానిబన్ధైస్సు రతోపచారైః క్రీడాసుఖం జన్మఫ లం నరాణామ్
కిం సౌరభే యా శతమధ్య వర్తీవృషో పి సంభోగసుఖం నభుంక్తే.

శ్లో॥ స్వనారీ రక్షణం పుంసాం పరనార్యను రంజనమ్
బంధ భేదేంగితజ్ఞాన మేతత్ఫల ముదాహృతమ్.

కొక్కోకుని మార్గ దర్శకుడుగా గ్రహించి ఇతడు కూడా కామశాస్త్ర ప్రయోజనాన్ని గూర్చి తన గ్రంథంలో నిర్వచించాడు.

రేవణారాధ్యుడను నతడు 'స్మర తత్వ ప్రకాశిక' అను గ్రంధంను రచించాడు. ఈ గ్రంథం 'వీరణారాధ్యుడు' రచించిన 'పంచరత్నము' అను గ్రంథానికి వ్యాఖ్యానం. దీనిలో పంచవిధరతుల వివరణలున్నాయి.

(సశేషం)

# జీవితంలో నూరుపుటలు తిరగవేసిన నీరద్ చౌదరి

- డా॥ బి. పార్వతి

ఆంగ్లరచయిత, అతికఠిన విమర్శకుడు, ప్రపంచ చరిత్రకారులతో సమతూగ కలిగిన చారిత్రక స్పృహ కలిగిన వ్యక్తి, పండితుడు బహుభాషాకోవిదుడు అయిన నీరద్ చౌదురి భారతీయుడు. అయితే ఇంగ్లాండ్‌లో ఉంటాడు. తన తొంభయి తొమ్మిదవ యేట ఒక పుస్తకం రాసి ప్రచురించటం, తన నూరవ జన్మదినాన్ని జరుపుకోవటం. ఈ శతాబ్దపు అద్భుతాలలో ఒకటిగా చెప్పవచ్చేమో!

1897వ సంవత్సరంలో నవంబరు 23న కిషోర్‌గంజ్ అనే తూర్పు బెంగాల్‌కి చెందిన గ్రామంలో నీరద్ చౌదరి జన్మించారు. ఆయన తండ్రి న్యాయవాద వృత్తిలో వుండేవారు. తల్లికి కొన్ని ఆచారాల పట్ల అచంచలమైన దీక్ష, విశ్వాసాలు వుండేవి. నీరద్ చౌదురి కుటుంబం 1910 లో కలకత్తాకి తరలి వెళ్ళింది. ఆయన విద్యాభ్యాసం కలకత్తాలోనే సాగింది. బి.ఏ. ఆయన విశ్వవిద్యాలయంలో ప్రథముడిగా నిలిచారు. అయితే ఎం.ఏ పరీక్షలలో ఏ కారణం చేతనో ఆయన ఉత్తీర్ణులు కాలేదు. విశ్వవిద్యాలయంలో చేరాలని, చరిత్రకారుడు కావాలని ఆయన కన్నకలు నిజంకాలేదు. ఆ తరవాత పదహారు సంవత్సరాలు ఆయన దారిద్ర్యాన్ని, అవమానాన్ని, అనుభవించానని ఆత్మకథలో రాసుకొన్నారు. ఇష్టంలేని గుమస్తా ఉద్యోగంలో చేరారు. బాగా పని చేయలేకపోవటం వలన వుద్యోగం పోగొట్టుకున్నారు. కొన్నాళ్ళు శరత్ చంద్ర బోసు వద్ద కార్యదర్శిగా పనిచేశారు. రచయితగా జర్నలిస్టుగా తన అదృష్టం పరీక్షించుకోవటానికి కలకత్తానించి ఢిల్లీ వెళ్ళారు.

అక్కడ ఆకాశవాణిలో రాజకీయ సైనిక విషయాలపై వ్యాఖ్యాతగా పనిచేశారు. 1951 వ సంవత్సరంలో ''అనామకుని ఆత్మకథ''. (The Autobiography of an Unknown Indian) ని ప్రచురించారు. అప్పటినించి ఆయన A Passage to England (1959), The Continent of Ecice (1965), The Indian Intellectual (1968), To Live or Not to Live (1970), Hinduism, Culture In A Vanity Bag, Clive of India, Max Muller, Scholar Extraordinary, The Three Horsemen of The Apocalypse (1997). అనే పుస్తకాలు రాసి ప్రచురించారు.

ఆయన రాసిన ఆత్మకథనించి ఈనాటి వరకు కూడా అన్ని రచనలు పాఠకులని నొప్పించాయి. ప్రభుత్వ విభాగలేవీ కూడా నీరద్ చౌదురి వ్యాసాలని స్వీకరించరాదని సమాచార మంత్రిత్వశాఖ ఆదేశాలు జారీ చేసింది. ఆర్థిక మంత్రి టి.టి. కృష్ణమాచారి హయాంలో ఈ నిషేధాన్ని ఎత్తివేసినా, నీరద్ చౌదురి మాత్రం ప్రభుత్వం మీద తన నిషేధాన్ని తీయలేదు. ఆ విధంగా దేశం తోటీ, దేశప్రజల సాంఘిక మతాచార వ్యవహారాలగురించి నీరద్ చౌదురి వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఆయనకి ఆంగ్లాభిమాని అనే పేరు తీసుకొచ్చాయి. భారతదేశం లోని పేదరికం, మత విశ్వాసం మూఢాచారం, ప్రజల ఆలోచనలు ఆయన్ని నిరంతరం ఆలోచింపచేసి. విభేదింప జేసి దేశాభిమానం ఆవంతైనా లేని వ్యక్తిగా ముద్రవేశాయి. హిందూ ధర్మంలోని ఆధ్యాత్మకతని రవంతైనా లక్ష్యపెట్టని ఆయన దృష్టి విచిత్రంగా వుండటమే కాకుండా బాధిస్తుంది కూడా. మన జాతి, ఆలయాల గురించి, శిల్పాల గురించి, ఆధ్యాత్మికత గురించి ఆయన చేసిన వ్యాఖ్యలు సాధారణ ధోరణికి దూరంగా వుండి ఆలోచనరేకెత్తించి అందులో వున్న నిజానిజాలని పరిశీలించేందుకు ప్రేరేపిస్తాయి.

అయితే పాఠకులలో ఆలోచన తలయెత్తే ముందే ఆయన చేసిన వ్యాఖ్యల పట్ల కోపం తాడెత్తున లేస్తుంది. A Passage to England నేను చదివిన నీరద్ చౌదురి మొదటిపుస్తకం. చదవాలి అన్న బాధ్యతతో తెరిచిన పుస్తకం కాబట్టి కోపం కలిగినా మూసివేయలేకపోయాను. V.S. నాయిపాల్ అనే రచయితకి కూడా నీరద్ చౌదురిలాగే కొన్ని విపరీత వ్యాఖ్యానాలు చేయటం అలవాటు. పాఠకులకి నొప్పి కలిగించే విషయాలు ఏమిటి అంటే భారతదేశాన్ని వీరిద్దరూ కూడా పరుషంగా చిత్రీకరించటం, దేశసమస్యల పట్ల కించిత్తు కూడా అవగాహన, సహనం చూపక పోవటం. నీరద్ చౌదురి మాటల్లో చాలా వాస్తవాలున్నాయి నిష్ఠూరాలైనా అవి నిజాలే అందువల్ల ఆయన చాలా తిరస్కార భావాన్ని ఎదుర్కోవలసి వచ్చింది.

ఆత్మకథ ప్రచురించాక 1955 లో నీరద్ చౌదురికి బి.బి.సి. ఆహ్వానం పైన ఇంగ్లాడు దర్శించే అవకాశం కలిగింది. పశ్చిమదేశాల సంస్కృతి సాహిత్యం. చరిత్రలని క్షుణ్ణంగా ఆయన చదివారు. ఇంగ్లాండుకి చదువు పేరుతో వెళ్ళే అవకాశం లేని వ్యక్తికి తన కల ఫలించినట్లయింది. ఆ ప్రయాణ ఫలితమే A passage to England. ఈ పుస్తకం చదువుతుంటే రెండు విషయాలు చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఒకటి చిన్న పిల్లవాడిలాగా ఆయనకి కలిగిన సంతోషం, రెండు ఇంగ్లాండు ఇండియా దేశాలని అడుగడుగునా పోల్చటం. విపరీతమైన ఆంగ్లదురభిమానిగా పేరు తెచ్చుకున్న నీరద్ చౌదురి ప్రతి విషయంలోనూ ఈ రెండు దేశాలనీ పోల్చి చూడటానికి గల కారణం ఆయనలో అంతర్లీనంగా తనదేశం పట్లగల అభిమానం, ప్రేమ అనటానికి సందేహంలేదు ఇంగ్లాండు లాగా భారతదేశం ఎందుకు లేదు అన్న ప్రశ్న ఆయన రచనలో దాగి వుండటమే కాక ఆప్రశ్నకి సమాధానం కూడా ఈ పుస్తకంలో గోచరిస్తుంది. భారతదేశంలోని వేడికి, తీక్షణమైనసూర్యకాంతికి అలవాటుపడ్డవారిని ఇంగ్లాండు లోని చల్లదనం, ఆ పరిసరాల తేలిక రంగులు ఆశ్చర్యపరుస్తాయని ఆయన రాశారు చల్లదనంతో సహనం పెరుగుతుందని, పరిశీలనల వాడి తరుగుతుందని ఆయన అభిప్రాయం. ఉష్ణదేశాల్లోని వేడి వల్ల మనుషులకి చిరాకు, అసహనం పెరుగుతాయని కూడా ఆయన రాశారు ఇంగ్లాండులోని పచ్చని పచ్చిక బయళ్ళు భారత దేశంలో పకృతితో మానవుడు చేసే నిరంతర పోరాటాన్ని ఆయనకు జ్ఞప్తికి తెచ్చాయి.

మతం గురించి రాస్తూ క్రైస్తవ మతంలో ధనం ఇచ్చి పుచ్చుకునే పద్ధతిలేదని, కానీ హిందూ మతంలో డబ్బు చేసుకునే అన్ని మార్గాలకీ తావుందని, హింసాపూర్వకంగా అన్యాయ మార్గాల, ద్వారా కూడా డబ్బు గడించే అవకాశం ఇక్కడి మతంలో ఏర్పడిందని ఆయన అన్నారు. అయితే ఇంగ్లాండులో అన్నీ నచ్చినా, నీరద్ చౌదురికి ప్రేమ, పెళ్ళి పట్ల ఇంగ్లీషు వారి నిలకడ లేనితనం నచ్చలేదు. ఇంగ్లీషువారు పారిశ్రామీకీకరణ, ప్రజాస్వామ్యాల కారణంగా మతానికి దూరమవుతున్నారనే విషయం ఆయనకి ఆందోళన కలిగించింది. ఇంగ్లాండుతో పోల్చితే భారతదేశంలోని గొడవ, ఆపకుండా మాట్లాడటం, బద్ధకము, అవినీతి, నియంత్రించలేని నదులు, బక్కచిక్కిన ఆవులు, మతం అన్నీ కూడా ఆయనకి లజ్జాహేతువులుగా తోచాయి. కానీ ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగార్ చెప్పినట్లు నీరద్ చౌదురి తనహృదయాంతరాళాలలో చాలామంది భారతీయులకంటే జాతీయత కలిగిన వ్యక్తి, ఇంగ్లీషు వారికంటే ఎక్కువ ' ఆంగ్లత్వం' కలవారు.

The Continent of Circe లో నీరద్ చౌదురి భారతదేశపు చరిత్రని, జాతిని, మతాన్ని,

మత సాంఘిక ఆచారాలని విశ్లేషించారు. ఇంగ్లీషు రచయితలు పాశ్చాత్య ఆర్థికవేత్తలు, పరిశీలకులు, నిపుణులు వీరెవరికీ భారతదేశాన్ని గురించిన సరి అయిన అవగాహన లేదని ఆయన తన గ్రంథం మొదటి అధ్యాయంలో పేర్కొన్నారు. భారతీయులు కూడా ఒక విధంగా పాశ్చాత్యులేనని, వారు ఎవరి సహాయమూ లేకుండా స్వశక్తితో దేశాన్ని బాగుచేసుకోగలరనీ, పైన చెప్పిన వారందరూ భారతీయులను తమంత తాముగా పెరిగేటందుకు విడవాలనీ సూచించారు.

భారతదేశంలో వున్న విపరీత పరిస్థితులని గురించి ప్రస్తావిస్తూ వీటి గురించి ఆశ్చర్యపోవటం అనేది యెబ్బెట్టు తెచ్చిపెట్టుకున్నట్టు వుంటుందని అన్నారు. ఈ దేశంలో నివసించటానికి అవసరమైన ముఖ్య లక్షణాలు ఏమిటంటే ఎక్కడ పడితే అక్కడ కనిపించే మలాన్ని, వివిధ క్షీణదశల్లో వున్న కుష్ఠురోగులను చూసీ చూడనట్టు వదిలి వేయటం. ఇక్కడ జీవితాన్ని అర్థం చేసుకునేందుకు తమ చుట్టూ వున్న కుళ్ళుని భరించటం అనేది చాలా అవసరమని నీరద్ చౌదురి వుద్దేశం.

ఇండియన్ అనే పదం బదులు హిందువు అనే పదాన్ని భారతీయులని సూచించేందుకు వాడాలని ఆయన అభిప్రాయం. అమెరికన్, యూరోపియన్ అని అంటున్నట్లే హిందువు అనికూడా అనవచ్చని ఆయన అన్నారు. ఆర్యులు లేక హిందువులు యూరోప్‌నించి వలస వచ్చి ఈ ఉపఖండం బారిన పడ్డారని నీరద్ అభిప్రాయం. శ్వేత వర్ణం కలిగిన వీరు అప్పటికే ఉపఖండంలో నివసిస్తున్న నల్లటివారిని శూద్రులని చేసి పాలించారని ఆయన రాశారు. వర్ణ వ్యవస్థబాగా వ్యాప్తి చెందినా ఔత్సాహికులైన ఇతర వర్ణస్థులను రాజులు మంత్రులుగా పరిపాలకులుగా నిరోధించలేదని నీరద్ చౌదురి లోని నిశిత పరిశీలకుడు భావించాడు. వర్ణవ్యవస్థకు మూలం ఆర్య అనార్య శరీర వర్ణాలని, నల్లని వారిని కొంచెంగా చూడటం కూడా తెల్లని రంగు కల యూరోపియన్ వలసదారులనించి సంక్రమించిన అభిజాత్యమని ఆయన రాశారు. వర్ణమంటే రంగు. వర్ణవ్యవస్థ మనుషుల రంగుపై ఆధారపడింది, వర్ణసంకరం జరుగుతుందని భయపడేవారు. అంటే అసలు దీనికి అర్థం రంగు మారుతుందని దీనికి కులం పాడైపోవటం అన్న అర్థం కాలంతో వచ్చింది.

సనాతన ధర్మమైన భారతీయ ఆచారాకి హిందుయిజం అనే పేరు పాశ్చాత్యులు పెట్టారని నీరద్ చౌదురి అభిప్రాయ పడ్డారు. భౌతికము, ప్రాపంచికము అయిన ఈ ధర్మానికి ఆధ్యాత్మికత,. అలౌకికత పాశ్చాత్యులు అంటగట్టారని ఈయన రాశారు. పశ్చిమ దేశాలలో లేని వారికి అత్యవసరమైన ఆధ్యాత్మికతని వారు ఈ దేశపు గ్రంథాలలో మనుషులలో వెతికి పెట్టారని నీరద్ చౌదురి అభిప్రాయం. హిందూయిజంలో, టాగోర్‌లో కూడా వారు లేని ఆధ్యాత్మికతని చూశారని ఆయన అన్నారు.

భారతదేశంలోని కొన్ని ఆచారాలు, అలవాట్ల గురించి ఆయన ఆసక్తికరమైన వ్యాఖ్యలు చేశారు. పుష్కరాల ప్రస్తావన అందులో ఒకటి. శీతల దేశాల నించి వచ్చిన ఆర్యులు ఉపఖండంలోని వేడికి తాళలేక నదులని, నదీ జలాలని ఆశ్రయించారని అందుకు కుంభమేళా ఒక ఉదాహరణే ఆయన అన్నారు. భౌతికతని ఆధ్యాత్మికతతో జోడించే హిందువులందరూ హిపోక్రైట్స్ అని ఆయన అభిప్రాయం. వేదాలు క్రీ.పూ. 1400 సంవత్సరం ఆర్యులు ఇంకా మెసోపొటేమియాలో

వున్నప్పుడే పుట్టాయని ఆయన అన్నారు. మనదేశంలో కఠిన నియామాలు ఆచరించటం శరీరాన్ని పలు బాధలకి గురిచేయటం అన్నది ఈ వాతావరణాన్ని ధిక్కరించే ప్రయత్నాలని ఆయన విశ్లేషించారు. శుభ్రత, అశుభ్రత పట్ల మనుషులకున్న విభిన్నమైన దృక్పథాలు ఆశ్చర్యం కలిగిస్తాయి. కొంతమంది విపరీతమైన శుభ్రతని పాటించటం, మరి కొంతమంది చుట్టూవున్న పెంటకుప్పల్ని, చెత్తా చెదారాన్ని అసలు పట్టించుకోకపోవటం అన్నవి ఈ దేశపు వాతావరణం మానవ మేధస్సుతో ఆడే ఆట ఆయన అభిప్రాయం.

గుళ్ళకి, గోపురాలకి పూజలకి పునస్కారాలకి లేని ఆధ్యాత్మికతని ఆపాదించారని, అందుకు నిదర్శనం ఆలయాలపై వున్న శృంగార శిల్పాలు అనీ ఆయన భావన. ఆలయ నిర్మాతలకి అసలు ఆధ్మాత్మికత అనే భావమే లేదని ఆయన వాదించారు. హిందూమతం గా మారిన సనాతన ధర్మాన్ని పల్లె ప్రజలు నిలబెడుతున్నారని అని నీరద్ చౌదురి రాశారు.

పద్దెనిమిదవ శతాబ్దంలో ఇక్కడికి వచ్చిన పాశ్చాత్యులు ఈ దేశపు భాగ్యాన్ని, జ్ఞాన ధనాన్ని చూసి ధర్మ బుద్ధిని కోల్పోయారని ఆయన రాశారు. E.M. ఫారెస్టర్ అనే రచయిత భారతీయులను వక్రంగా వికృతంగా, హాస్యాస్పదులుగా చిత్రీకరించాడు. ఆంగ్లేయులు భారతీయుల్ని పశువులుగా భావించటం వల్ల తమకున్న వివేకాన్ని విశ్లేషణా శక్తిని కోల్పోయారని ఆయన భావించారు.

ఇక ఆధునిక కాలంలో స్వాతంత్ర్యం వచ్చాక కూడా భారతదేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చటానికి పాశ్చాత్యులు చేస్తున్న ప్రయత్నాలని నీరద్ చౌదురి వ్యతిరేకించారు. హిందువులు తమ ఉనికిని కోల్పోయి అమెరికన్లుగా చెలామణి అవుతారని, దేశానికి కావలసినది అమెరికనైజేషను కాదు, పారిశ్రామీకీకరణని భారతీయతతో నింపటం అనీ ఆయన అభిప్రాయ పడ్డారు. దేశ విభజన అనేది ఆయుక్తమైన పిరికి తనంతో కూడిన నిర్ణయం కాకపోతే ఆ సమయంలో అదే అతి వివేకవంతమైన చర్యలా కనిపించిందని రాస్తూ భారతదేశపు విదేశాంగ విధానానికి పాకిస్థాన్ ఒక గుదిబండ అని వ్యాఖ్యానించారు.

ఆధునిక హిందువుల గురించి ఆయన వారు క్లైబ్యంతో బాధపడుతున్నారని అన్నారు. బోధకులందరూ క్లీబత్వాం గురించీ హెచ్చరిక చేశారని ఆయన రాశారు. ఈ పుస్తకాన్ని ముగిస్తూ ''మనం కూడా ఒక విధంగా పాశ్చాత్యులమే. మనకి పరాయి పోషణ అవసరం లేదు మనకున్న శారీరిక మానసిక శక్తితో జీవితాన్ని, గమ్యాన్ని, ఆర్థిక రంగాన్ని మలుచుకుని మెరుగుపరిచే సమర్థత మనకి వుంది.'' అని రాశారు.

హానికరమైన అంధవిశ్వాసం, అంధప్రేమ, భక్తి నించి కాపాడే శక్తి నిజాయితీగా నిర్మొహమాటంగా వుండే రచనలకి వుంది. రచయితలు, మేధావులు స్వతంత్రులు. మనుషులుగా వారు అనుభవించిన బాధ మేధస్సును ప్రజ్వరిల్ల చేస్తుంది. నీరద్ చౌదురి ఇటువంటి వ్యక్తి. ఆత్మకథ గురించి సర్‌జాన్ స్క్వైర్ (Squire) 1951 లో సర్ సి. ఆర్. రెడ్డికి ఈ విధంగా రాశారు. ''కొంత కాలం తర్వాత ఈ రచయిత ఇంగ్లాండులో తలదాచుకునే పరిస్థితి రావచ్చు ... ఎన్ని కోల్పోయినా ఇంగ్లీషువారు స్వతంత్రంగా ఆలోచించే శక్తిని మాత్రం ఇంకా కోల్పోలేదు.'' 1970వ సంవత్సరంలో నీరద్ చౌదురి భారత దేశం వదిలి ఇంగ్లాండు వెళ్లారు. అప్పటినుంచి ఆయన తన కుమారుడి వద్ద ఆక్స్‌ఫర్డ్‌లో నివసిస్తున్నారు. ఈ శతవర్ష రచయితకి నా వందనాలు.

# భారతీయ సంస్కృతి భాష్యకారుడు ఎ.యల్. బాషం

- శివలింగం

విదేశీయులైన భారతీయ చరిత్ర కారుల్లోను, సాంస్కృతిక, మత, తాత్విక రంగాలలో విశేషకృషి చేసిన మహనీయులలో ఆర్థర్‌లెవెలిన్ బాషం (A.L.Basham) గణనీయుడు. భారతదేశమంటే అమిత అభిమానం, ప్రేమ. ఆస్ట్రేలియా జాతీయ విశ్వవిద్యాలయంలో ఆసియా నాగరికత ఆచార్యుడు. బాషం (1914-1986) మరణం గురించి భారతీయ ప్రతికా ప్రపంచం సరిగా తెలియచేయలేదంటే అతిశయోక్తికాదు. భారతదేశపు గతకాలపు ఔన్నత్యాన్ని లోకానికి చాటిచెప్పాడు. 72 సంవత్సరాలు జీవించాడు. భారతదేశం గురించి రాసిన ముఖ్యమైన గ్రంథాలు:

1. History and Doctrines of AJIVAKAS - 1951
2. The Wonder That was INDIA - 1954
3. The Origin and Development of Classical Hinduism Edited and annoted by Kenneth. G.Zysk. 1989.

నలభై సంవత్సరాలవయస్సులో భారతీయ సంస్కృతి మీద మహత్తరమైన ప్రామాణిక గ్రంథం 'దివండర్ దట్‌వజ్ ఇండియా' రాసి పండిత పామరుల మన్ననలు పొంది చిరకీర్తి నార్జించిన మహనీయుడు. బాషం వైదుష్యం అపారం. భారతీయసంస్కృతిని అవగాహన చేసుకోవాలంటే సంస్కృతం, ప్రాకృతం, హిందీ, బెంగాలీ వంటి భాషలు తెలిసి వుండాలి. విభిన్న మతాలు, తాత్విక ధోరణులు. వీటన్నిటిని నిశితంగా పరిశీలించి చక్కని అనువాదాలుచేశాడు. రాధాకృష్ణన్ భారతీయ తత్వశాస్త్రాన్ని వెలుగులోకి తీసుకువచ్చి పాప్యులర్‌చేశాడు. భారతీయ సంస్కృతిని సమగ్రసుందరంగా అందించి దానికో విశిష్టత కల్పించాడు బాషం. ఎందరో విద్యార్థులను పరిశోధకులుగా తీర్చిదిద్దాడు. భారతదేశం గురించి ఉపన్యాసాలివ్వవలసిందిగా ప్రపంచంలోని అనేక విశ్వవిద్యాలయాలు ఆహ్వానించాయి. భారత దేశచరిత్రలో చీకటికోణాలు లేవంటాడు. నాలుగువేల సంవత్సరాల నాగరికత కలిగిన భారతదేశం. ప్రతి చారిత్రక కాలంలోనూ వర్తమాన సమాజానికి కావలసిన ప్రగతిని వదలి వెళ్ళిందంటాడు. మతం, సంస్కృతి, కళలు, పురావస్తు శాస్త్రం, భాషాశాస్త్రం, రాజకీయాలు- వీటన్నిటిలోనూ చరిత్రకారునికి పరిజ్ఞానం వుండాలి. బాషంకు వివిధ విషయ పరిజ్ఞానం పుష్కలంగావుంది ప్రతి మనిషి ఆయనకు ఆత్మీయుడు. ప్రతిభాషా తనదే. చరిత్ర కారుల్లో కూడా సంస్కరణ వాదులూ, పునరుద్ధరణ వాదులూవుంటారు. ఒకసారి లుంబినీలో (నార్లవారిల్లు) నార్లవారిని కలుసుకున్నప్పుడు చరిత్రకారులైన తండ్రికొడుకులు ఎ.సి. మజుందార్, ఎ.కె . మజుందార్‌లను గురించి ప్రశ్నించడం జరిగింది. వారు సంస్కర్తలు కారు పునరుద్ధరణవాదులన్నారు. పూర్తిగా ఏకీభవించలేకపోయాను. భారతదేశ చరిత్రను చాలామంది రాశారు. విభిన్న రాజకీయ దృక్పధాలతో సమీక్షించారు. విదేశీ మనస్తత్వంతో అంటే పరప్రత్యయనే యబుద్ధితో వ్యాఖ్యానించారు కొందరు భారతీయులు.

స్వాతంత్ర్యానికి ముందురాసిన చరిత్రలు జాతీయోద్యమ ప్రభావంతో రాసినవి. దయానందసరస్వతి, బకించంద్ర, భూదేవ్ ముఖర్జీ, భండార్కార్, రాజేంద్ర లాల్‌మిత్ర, ఆర్‌సిదత్తు వంటివారు జాతీయోద్యమ ప్రభావంతో పాక్షికంగా రాసిన రాతలు. నీలకంఠశాస్త్రి, కె.యం ఫణిక్కార్ వంటివారు ఆర్యద్రవిడ సంస్కృతులు వేరనీ, దక్కన్‌ను వింధ్యపర్వతాలు విడదీశాయని రెండూ భిన్న సంస్కృతులనీ రాశారు. మార్క్సిస్టు దృక్పధంతో హిరేన్‌ముఖర్జీ, పామీదత్తులు రాశారు. మార్క్సిస్టు దృక్పధం వున్న పండితులు కోశాంబి, ఆర్‌ఎస్ శర్మ, ఇర్ఫాన్‌హబీబ్‌వంటి చరిత్రకారులు. మజుందార్ రాజకీయదృక్పధం లేకపోయినా హిందూమతాభిమాని అనిముద్ర వేశారు. ఇటువంటి దృక్పధాలకు తావీయకుండా బాషం సమన్వయ దృక్పధంతో రాశాడు. భగవద్గీతను గురించిరాస్తూ "The text is defence not only of the warriors duty to wage rightour warfare but also of the whole brahmanic social system అన్నాడు. కోశాంబి దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ భావాలకు భిన్నంగానే వున్నాయి. సంప్రదాయ విశ్లేషణ ఇండాలజిస్టుల ప్రత్యేకత. సంప్రదాయహిందూ మత మూలాలను అభివృద్ధిని వివరించాడు. బాషాశాస్త్రం, తులనాత్మకచరిత్ర, మతం, సాహిత్యాల ఆధారంగా రాశాడు. హరప్పా నాగరికత నుంచి ఆర్య మతం, యజ్ఞ సంప్రదాయాలు, తత్వశాస్త్రాభివృద్ధి పునర్జన్మ, ఋషులు వారికులాలు, నిరాశావాదం, శ్రామణికవాదం, భౌతికవాదం, కర్మసిద్ధాంతం. మొదలైనవాటిని గురించి ఆసక్తికరమైన చర్చచేస్తాడు. భారతీయ ఆలోచనాధారలో భౌతికవాద ధోరణి గురించి చాలా తక్కువ రాశాడు. సోమరసం అంటే గంజాయి అన్నాడు. ఆధునిక ఫార్ములా Corisoprodol plus aspirin : Rugbylabs అని చదివాను. ఆజీవిక సిద్ధాంత వ్యవస్థాపకుడు గోశాలమస్కరిపుత్ర. ఆజీవికులు దిగంబరులు. ఆజీవికుడు బుద్ధునికి ముందు సంవత్సరం 487 బి.సి.లో మరణించాడు. పురాణకాశ్యప, పకుధ కాత్యాయనుడు ఆజీవిక మార్గానుయాయులు. మౌర్యులకాలంలో వృద్ధిచెంది, అశోకుని కాలంలో వారికోసం గుహలు కూడా నిర్మించడి తరవాత క్షీణించింది ఆజీవికసంప్రదాయం. మైసూరులోను, మద్రాసులోను కొన్నాళ్లు బతికి 14వ శతాబ్దంతో అంతం అయింది.

భారతీయ నాగరికత ముఖ్య లక్షణం మానవత. ప్రజలు జీవితాన్ని ఆనందంగా అనుభవించారు. ఇంద్రియానందాలను, ఆధ్యాత్మికానుభూతిని కలిపి సేవించారు. ఏజాతి అందుకోని ఉన్నతస్థాయిని చేరుకుంది భారతదేశం అన్నాడు. కోశాంబి రాసిన భారత దేశచరిత్ర మీద విపుల విమర్శ చేశాడు. పూనా వెళ్ళి కోశాంబిని చూచాడు. పల్లెపట్టుల సౌందర్యాన్ని గ్రామపవిత్ర దేవాలయాలను దర్శించారు. వృక్షాలను గూర్చి, పూర్వచారిత్రక, సాంస్కృతిక అవశేషాలను గూర్చి చర్చించుకున్నారు కోశాంబి మత విశ్వాసి కాకపోయినా 7వ శతాబ్దికి చెందిన జాన్‌బన్యన్ రాసిన Pilgrims Progress అంటే అభిమానం. నిరాడంబరశైలి, నైతిక పాఠాలు అతణ్ణి ఆకర్షించాయని తెలియచేశాడు బాషం.

బౌద్ధికంగా భారతదేశానికి ప్రపంచం రుణపడివుంది. ఇండియాస్వీకరించినదాని కన్నా యిచ్చిందే ఎక్కువ. The wonder that was India అన్న గొప్ప గ్రంథం అందించిన బాషం మరణం దేశానికి తీరనిలోటు. భారతీయ సంస్కృతికి భాష్య కారుడు బాషం

# ఆదిభారతీయుల నాగరికత

## సంస్కృత భాషా సంస్కృతులపై – దళిత భాషలసంస్కృతుల ప్రభావం

– కత్తి పద్మారావు

అసురులు, దస్యులు, నాగులు ఎవర్నైతే ఆర్యులు భారతదేశం ఎల్లల్లో కలిశారో వారుకేవలం ఆదిమతెగలేకాకుండా, నగరాలను, భవనాలను ఆర్యులు వచ్చే నాటికే నిర్మించిన నాగరికులు. ఇలాంటి మరికొన్ని నిజాలు మనకు వేదాల్లోనే కన్పిస్తున్నాయి. వేదాల్లో చెప్పినట్లుగానే రాతి కట్టడాలు ఎక్కువగా కన్పించడం గమనించదగ్గ విషయం. అసురులే ఆనాటి సమాజంలో శత్రువులుగా వున్న ఆర్యుల కంటే ఎక్కువ నాగరికత కలిగివున్నారు. ఈ చారిత్రక అంశాలను O.F.Oldham, "The son and the serpant' అనే తన ద్రావిడ చారిత్రాత్మక గ్రంథంలో ఈ విధంగా రచించారు. "Some of their cities were, as we shall soon see, place of considerable importance and, in addition to this, wealth and luxlury, the use of magie, Superior architurtural skill and ability to restide the dead to life, were ascribed to the Asura by Brahminical writer.'

అప్పటి అసురుల నగరాలే నేటికి కూడా చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకొని వున్నాయి. సంపద, సంపన్నతే కాకుండా, ఇంద్రజాలము, అత్యుత్తమ శిల్పనైపుణ్యము, చనిపోయినవారిని బ్రతికించగలిగిన సామర్థ్యం అసురులకుందని బ్రాహ్మణ రచయితలు తెలిపారు.

పై చెప్పబడిన శత్రువులను కూడా తిరిగి బ్రతికించగలిగే పద్ధతి కేవలం శస్త్రచికిత్స, మందుల వల్ల జరిగిందేగాని ఇంద్రజాలం ఏమిలేదు. ఇది ఆర్యులు చాలాకాలంగా సాధించలేదు. ఈ పద్ధతివలన చావుకు దగ్గరగా వున్న వారిని కూడా బ్రతికించగలిగారు దస్యులు.

అందువలన ఆర్యులు మరణం వచ్చినపుడు శత్రువులైన దస్యులమీదే ఆధారపడవలసి వచ్చింది. లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు ఆంజనేయుడు సంజీవిని మొక్క ద్వారా బ్రతికించడం చూశాము.

"The secret of the prouks by which their enemies were brought back to life, which has long sought in vain by the Aryans was mostly likely a knowledge of surgery and of the use of medicines.'

ఖగోళశాస్త్రంలో పండితుడైన గార్గుడు అనే ఋషి ఖగోళశాస్త్రాన్ని శేషనాగుడికి బోధించడం వలన శేషనాగునికి ఖగోళశాస్త్రము, గ్రహములను గూర్చి తెలిసిందని ఆర్య గ్రంథాలు చెప్తున్నాయి. కాని నాగుల దగ్గరే ఆర్యఋషులు ఖగోళశాస్త్రాన్ని నేర్చుకొన్నారు అనేది చారిత్రక వాస్తవం. చండాలుర ఖగోళశాస్త్రానికి, ఇతర ప్రాచీన జాతులవారి దగ్గర ఖగోళశాస్త్రానికి సంబంధాలు వున్నాయి. అసురులు సూర్యుణ్ణి పూజించడం, నాగుబాము తలను పవిత్రంగా భావించడం, దేవదారు వృక్షాలను పూజించటం, వాళ్ళ సాంప్రదాయకమైన నృత్యాలు, ప్రవక్తల ద్వారా దేవతలతో మాట్లాడడం ఆదిమ జాతుల గుర్తులను వాడటం వలన వీరికి తురేనియన్ సంస్కృతితో సంబంధమున్న జాతులుగా చరిత్రకారులు గుర్తిస్తున్నారు. తురేనియన్ జాతులకు, బాబిలోనియన్ జాతులకు, ఈలం దాని

పొరుగు దేశాల సంస్కృతులతో దగ్గర సంబంధాలున్నట్లు ఓల్డ్‌హోమ్ వివరించారు. దీనినిబట్టి ఛండాలుర ఖగోళశాస్త్రజ్ఞానం ప్రాచీనమైంది.

**ఆదిభారతీయుల భాష :** ఆర్యులు భారతదేశానికి వచ్చిన తరువాత ఇక్కడ కనపడే వారికి తెలియని వివిధరకాలైన జంతువులు, మొక్కలు, కొత్త వస్తుసామగ్రికి ఉపయోగించు పదాలను వెతుక్కోవలసి వచ్చింది. వాళ్ళు మొదట ఇక్కడికి వచ్చి ఇక్కడి జాతులతో సంబంధాలు పెట్టుకొనేటప్పటికే ఎన్నో ఇతర జాతులు భారతదేశానికి వచ్చివున్నాయి. అప్పటికి వలస వచ్చిన జాతులు, భారత ఆదిమజాతుల భాషలలోని పదాలు ఆర్యులు తమ భాషలోకి సంగ్రహించారు. అరటికాయ వివిధ భాషల ప్రభావంతో ఎలా మార్పు చెందింది మలయ పెనిన్సులా నుంచి అది ఎలా పరిణామం చెందుతూ వచ్చిందో స్కీట్ Skeat మరియు Blagden వివరించారు.

1921 బులిటన్ డిలా సొసైటి డిలింగ్విస్టిక్ పారిస్ (Bulletin de la Societic de Linguistique le Paris) అనే పత్రికలో సంస్కృతము మధ్యస్థంగా వుండే భారతీయ భాషలపై ఆస్ట్రో ఏసియాటిక్ భాషల ప్రభావాన్ని చర్చించారు. హిందీ, పంజాబీ మొదలైన భాషల యొక్క మూలాలు కోల్‌లేదా ముండా భాషల్లో దొరుకుతున్నాయని ఆధునిక భాషా శాస్త్రజ్ఞుడు S.K.ఛటర్జీ పరిశోధనల వలన తెలుస్తుంది. వీరి పరిశోధనల్లో హిందీ క్రియ అయిన 'జిమ్నా' అనగా తినుట అనేపదం కోల్ గిరిజన భాషనుండి తీసుకోబడింది. బెంగాలీలో ' ఇరువది' అనే సంఖ్యను 'కురి' 'కుడి' అను కోల్‌భాషా శబ్దం 'బిస్' అనే ఇండో ఆర్యన్ పదంగా మార్చబడింది. బెంగాలీలో ఉన్న 'కురి' అనే పదం ఆస్ట్రో ఏసియాటిక్ పదాల నుండి తీసుకోబడి ఉండవచ్చు. దీన్ని బట్టి ఈనాడు భారత ఉపఖండంలో ప్రసిద్ధిలో వున్న బెంగాలి వంటి భాషలు ఆదిభారతీయులైన గిరిజనుల, దళితుల భాషల నుండి తమభాషను అభి వృద్ధి చేసుకొని ఆ భాషలను త్రొక్కివేశారు.

ఈ విషయంలో ప్రత్యేక పరిశోధనలు చేసిన ఫ్రెంచి రచయితలు సిల్వైన్ లెవి, జీన్ ప్రిజ్‌విస్కి (Jean Przyluski) జ్యూలేస్‌బ్యాక్ (Jules Block) ప్రీ ఆర్యన్ ప్రీ ద్రవిడయన్ ఇన్ ఇండియా గ్రంథంలో గిరిజన భాషల నుండి కొన్ని పదాలు నాగరిక భాషల్లోకి ఎలా తీసుకోబడినాయో ఇలా వివరించారు.

"It seems, therefore, that the system of numarations has been trams formed by innavations which, no doubt go back to different periods and probably radiate each from a certain family. The analorgy of Rivng S-Kal and of Santate gal seems to indicate that one should search in the Non-Khmer languages from the origin of the competation by tem, wrile kure "to' very similar be an innovation properly".

ఈ విధంగా భాషాపరంగా కూడా ఆదిభారతీయులు నాగరికులై వున్నారు.

**సంస్కృతము – ద్రావిడ భాషలు :** సంస్కృత భాషపైన ద్రావిడ భాషల ప్రభావం బలంగా వుంది. ద్రావిడ భాష ద్వారా సంస్కృతం శక్తివంతమై ఆ ద్రావిడ భాషలనే న్యూనతపరచాలని చూసింది. సంస్కృతంపై ఇండో యూరోపియన్ భాషల ప్రభావం ఎలావుందో చెబుతూ జ్యూలియస్‌బ్లాక్ ఇలా వివరిస్తున్నారు.

"A good illustration of the influence of substratum in the evolution of languages may be found in certain transformations undergone by the Indo European language in India'. సంస్కృత భాషా మూలాన్ని Jules Bloch ఇండోయూరోపియన్ భాషలలో కనుగొని నిరూపించారు. అనేక అభివృద్ధి చెందుతున్న భాషలకు ఇండోయూరోపియన్ భాష మూలముగా వున్నదని చెప్పారు. సంస్కృత భాషలోని అనేక హల్లులు పాయినిక్ (Phorenic) భాషలోని హల్లులకు సమానంగా వున్నాయి. ఆనాడు ప్రసిద్ధి చెందిన అనార్య భాషైన ముండా భాష ఇపుడు భారత జనాభాలో వందోవంతు మంది చేతకూడా మాట్లాడబడటం లేదు. దానినుండి అభివృద్ధి చెందిన హిందీ, బెంగాలీ భాషలు జాతీయభాషలైపోయాయి.

ఈనాడు జాతీయభాషలుగా చలామణి అవుతున్న భాషలన్ని ఆది భారతీయులైన దళితుల భాషల జవజీవాలు గుంజుకొని బ్రతికిబట్ట కడుతున్నాయి.

ద్రవిడ భాషల్లో బ్రాహూయి భాష బలూచిస్థాన్ పశ్చిమ భారత దేశంలో ఇప్పటికీ మాట్లాడబడుతుంది.

ద్రవిడ భాషలు ఇండోయూరోపియన్ భాషలు వలసల వలన కకావికలై తమ వునికిపై గొడ్డలి వ్రేటు బడి తమ మూలాలను అట్టడుగు సమాజంలో దాచివుంచగా నాగరిక భాషలుగా ఇండోయూరోపియన్ భాషలు చెలామణి అయ్యాయి.

ఈ విషయాన్ని జ్యూలేస్ బ్లాక్ ఇలా వివరించారు :

"In the absence of direct historical evidence these consideration have generally lead one to think that dravidian is the language which has been replaced by Indo European and that the peculiarities of this language explain the innovations in Indo Aryan-'

ఆదిభారతీయుల భాషలో జవజీవలుండడానికి కారణం వారి జీవితం ప్రకృతి పునాది మీద సామాజిక వ్యవస్థల నిర్మాణంలో ప్రధానపాత్ర కలిగివుండడమే. అందుకే నాగరికసమాజాలు ఎప్పుడూ వీరిని కొల్లగొట్టి శక్తివంతం అవడానికి ప్రయత్నం చేస్తుంటాయి.

**నాగా సంస్కృతి :**

భారత ప్రాచీన జాతుల్లో 'నాగా' జాతి ముఖ్యమైనది. 'నాగ' అనేది త్రాచుపాముల్లో ఒక జాతి. దీనికే హిందువులు బయపడేది. ఈ 'నాగ' జాతియైన ఆదిభారతీయులకు ఆర్యులు శత్రువులుగా మారితే ఈ నాగుబాములను మాత్రం పూజిస్తున్నారు. 'నాగపంచమి' ని వీరు ఆచరిస్తారు.

ఆర్య గ్రంథాలు రెండు గణాలను ప్రధానంగా పేర్కొన్నాయి. ఒకరు దేవగణం, రెండవవారు నాగగణం. దేవగణానికి, నాగగణానికి తేడాని గురించి చెబుతూ-

The Nagas are not mentioned under that name in the Veda; but serpents are frequently referred to, as enemies of Indra and the Devas, and are described in Connexion with the Asuras or Dasyus.

హిందూ పౌరాణికగాథల్లో ఆర్యులకు, దస్యులకు మధ్య జరిగిన యుద్ధం వర్ణించబడింది. నాగుల ప్రస్తావన లేకుండా హిందూ గ్రంథాలు యెక్కడాలేవు. ఋగ్వేదంలో అసురులకు, దస్యులకు బదులు 'అహి' అనే పదాన్ని ఉపయోగించారు. వరుణుడు ఒక ఋగ్వేద కథ ప్రకారం ఉరుములు, మెరుపులతో 'వృత్త' పర్వతాన్ని ఢీకొంటాడు. నరికివేయబడిన చెట్టులాగా సర్పం భుమి మీద పడుతుంది. నీళ్ళన్నీ తన మీద ప్రవహిస్తున్నా వృత్త పర్వతం సర్పానికి రక్షణ కల్పించింది. వేదాల్లో ఇంద్రుడికి, దేవతలకి శత్రువు బలమైన నాగ సర్పంగా పేర్కొన బడింది.

'In the Rigveda the term Ahi or Serpent is applied to the Asuras or Dasyus. Thus, in one of the hymns we find; "With his vast destroying thusderbolt, Indra struck the darking multilated Vritra; as the trunks of trees felled by the axe, so lies Ahi prostrate on the earth". Again it is, said: "The waters that delight the minds (of men) flow over him recumbent on the earth as a river burst through its broken bomks: Ahi has been prostrated beneath the feet of the waters, which Vritra by his might had obstructed."

సామవేదంలో దస్యులు, దానవులు, అసురులు, దైత్యులు, ఆదిభారతీయ తెగలకు చెందినవారని ఆధారాలు కన్పిస్తున్నాయి. 'వృత్తాసురుణ్ణి' సంహరించినవాడిగా, పురాలను నాశనం చేసినవాడిగా, ఇంద్రుణ్ణి సామవేదంలో పేర్కొనబడింది. ఈ విషయాన్ని ఓల్డ్‌హోమ్ ఇలా వివరిస్తున్నాడు.

In the Sama Veda we find further proof that the Asuras and Dasyus, Daityas and Danvas, were hostile tribes. Thus it is said: "O Indra, when fleeing from Vitra, Asuras wrath, and again: "Indra, like a friend, advanced to the front of the battle and slew vitra. He1 like a hero hewed down the hosts of the Danavas, and as a protector, our joes "Then we have : "All the moving tribes of men bow down before the wrath of Indra, as all the rivers bend towards the sea. He strikes off the head of the earth - shaking Vritra, with his rain Causing, hundred spiked Vajra"Cthunderbolt) and further : Indra is the devorer of Vitra, over thrower of Bala. The destroyer of cities, and the skedder of water.

అసురులు, దస్యులు, దైత్యులు మరియు దానవులు శత్రు తెగలుగా తెలుపుతూ సామవేదం అదనపు ఆధారాలందిస్తుంది. '' ఓ ఇంద్రా వృత్తాసురుని ఆవేశాన్నుండి తప్పుకొనుటకు నీవు పారిపోయినప్పుడు నీమిత్రులైన దేవతలంతా నిన్ను ఏకాకిని చేసిరి. మరలా ఇంద్రుడు ఒక 'మిత్రా' రూపంలో యుద్ధంలోకి దూసుకొని వచ్చి వృత్తాసురుని వధించాడు. ఒక నాయకుడిగా దానవ మిత్రులను వధి ంచాడు. వారి శత్రువులను క్రుంగదీశాడు. ప్రతి నదీ సముద్రానికి వెళ్ళి ఎలా కలుస్తుందో అలాగే ప్రతి సంచార జాతి ఇంద్రావేశానికి లొంగిపోవేటట్లు చేయగలిగాడు. భూమిని గజగజలాడించిన వృత్తాసురుని యొక్క శిరస్సు ఇంద్రుడు ఛేదించాడు. మంచి వర్షానికి సంకేతంగా వుండేటటువంటి పిడుగుతో అతడు వృత్తాసురుణ్ణి ఛేదించాడు. వృత్తసురుణ్ణి ఇంద్రుడు మేసినవాడిగా, పురందరుడు నీటిని ఛేదించినవాడుగా వర్ణితమైయింది. ఈ విషయమంతటిలో మనకు కనిపిస్తున్నదేమిటంటే వృత్తాసురుడు అసురుల యుద్ధయోధుడిగా కన్పిస్తున్నాడు అని C.F. ఓల్డ్‌హోమ్ వివరించాడు.

అధర్వణవేదంలో కూడా వృత్తాసురుడు అసురులు, దస్యులకు సంబంధించినవాడుగా చెప్పబడ్డాడు.

ఇంద్రుడు మంత్రప్రయోగంచేసి వృత్రాసురుణ్ణి చంపినట్లు అధర్వణవేదంలో చెప్పబడింది. అసురులను నాశనంచేసిన వాడిగా ఇంద్రుడు చెప్పబడ్డాడు.

వేదాలన్నింటి నిండా మనకు సరిపోయిన ఆధారాలు ఎలావున్నాయంటే అసురులు, దస్యులు, దైత్యులు, దానవులు అంతా ఆర్యులకు , వారి నాయకుడైన ఇంద్రునికి శత్రువులుగా చెప్పబడుతున్నారు. వీరందరినీ వారు మొత్తంగా నాగజాతి అన్నారు.

"We have there fore; from the Vedas, ample evidence that the Asuras, Dasyus, Daityas and Danavas, who opposed Indra and the Aryas, were tribas of serpent rasce"

ఈ నాగులు ఎవరు? వీరెక్కడి నుండి వచ్చారు అన్నదాన్ని గూర్చి వున్న ఆధారాలను బ్రాహ్మణ చరిత్రకారులు పరిగణలోకి తీసుకోవటంలేదు. కనుక వీరి మూలాలను వెలికితీసే ప్రయత్నం మనం చేయవలసిందే. ఋగ్వేదంలోని ఋక్కులు నిస్సందేహంగా ఆర్యులురాకపూర్వమే భారత భూ భాగంలో ప్రభావించిన భావజాల ప్రభావంలో వచ్చినవే.

అయితే వాటిని ఆర్యులకు అనుకూలంగా మలచుకొన్నారు. అసుర అనే శబ్దం పారశీకుల 'అహుర' శబ్దంతో పోల్చవచ్చును. తొలి వేద ఋక్కులలో ఈ అసుర అనేబిరుదు ఇంద్రుడు మరికొంతమంది దేవతలకు గౌరవప్రదంగా ఆపాదించబడింది. తరువాత భాగాల్లో అసురులు భిన్నంగా చూపించబడ్డారు. దేవతలు 'అహురు'ల మధ్య వివాదం రేకెత్తిన తరువాత 'అహుర' అనేపదాన్ని అసురుల్లాగా హరించి వారిని దేవతలు శత్రువుల్లాగ పేర్కొనటం జరిగింది.

'పారశీక దేశంలో' దేవ అనేపదం నిందావాచకంగా ఉపయోగించినట్లే వేదాల్లో 'అసుర పదాన్ని అగౌరవ పదంగా వాడారు. అమరకోశంలో అసురులను పూర్తిగా దేవతల శత్రువులుగానేగాక, విద్యలేనివారిగా, అనేక న్యూనతలను ఆపాదించి అగౌరవ జాతిగా తేల్చారు.

1. ''అసురాదైత్య దైతేయ దనుజేంద్రాది దానావాః

శక్ర శిష్యా దిదిసుతాః పూర్వదేవాః సురద్విషః

అసురాః న విద్యతే సురాయేషంతే - అమృతము లేనివారు సురేభ్యభవా - దేవతలుగానివారు. యజ్ఞాన్ని దస్యంత ఇతివా- యజ్ఞభాగమువలన ద్రోయబడినవారు. అనుక్షేపణే. అసున్ ప్రాణాన్ రాంతి గృహ్ణం తీతివా1 - (ప్రాణములను గొనువారు.) భారతదేశానికి వచ్చిన ఆర్యులు తాము వచ్చేనాటికే ఎంతో నాగరికతను సంపాదించుకొన్న ఆదిభారతీయులను న్యూనత పరచడానికి వారి భాషద్వారా, సంస్కృతిద్వారా, కళారూపాలద్వారా, కుయుక్తులద్వారా, ఎన్నో ప్రయత్నాలు చేశారు. అయితే సహజాతంగా ఆదిభారతీయులు సామర్థ్యం, నాగరికత కలిగినవారు. కనుక వారి సాయుధ, సాంస్కృతిక దాడులను తట్టుకొని చరిత్రలో నిలవగలిగారు.

సజీవమైన నాగరికత కలిగిన జాతులను కూల్చడం. దురాక్రమణే ధ్యేయంగా కలిగిన ఆర్యజాతులవంటి వారికి సాధ్యంకాలేదని ఆదిభారతీయులు నిరూపించారు.



*A statue of Neptune on the Mackinnon Mackenzie Building housing the Bombay Chamber of Commerce and Industry overlooks Bombay harbour. The Chamber completed 160 years of its existence*

